మహిళా ఉద్యమ కరదీపిక

# చైతన్య మానవి



త్రైమాసపత్రిక

జూలై - సెప్టెంబర్, 2014

## భద్రకాళివై మృగాళ్ళ భరతంపట్టు




## ప్రతి మనిషి తలవాలి

ప॥ ఢిల్లీలో నిర్భయ ఘోరం
ఏపిలో నాగవైష్ణవి నేరం
మానవతకే మానని గాయం
ఢిల్లీనుంచి గల్లీ వరకు
సమస్తం నేర మయం
ఎటుపోతుందీ దేశం
ఏమౌనో మనభవితవ్యం
చేయాలి ప్రతిఘటనోద్యమం

చ॥ భయటకెళితే తిరిగొస్తామో రామో
ఏఘోర కలి ఖబలిస్తుందో ఏమో
క్షణం క్షణం భయముతో బతుకుతున్నాము
చేసారు పాలకులు ఈతీరుగ అనేది నిజము

చ॥ తల్లికి పుట్టిన తనయుడే రాక్షసుడౌతుంటే
ఈమానవలోకం మృగవనమే అవుతుంటే
మానవత్వమే నశించిపోయి క్రూరత్వమే పాలిస్తుంటే
మగువుల బతుకు మంటగలిపే మృగాడులే సంచరిస్తుంటే
క్షణ క్షణము వొనుకుతు బతుకుతున్నాము మనము
ఏక్షణాన ఏమౌతుందోనన్నది తలసుకుంటేనే భయము

చ॥ పరిష్కారం లేదా? పాలకులకు తెలియదా??
అనుక్షణము మగువకు మరణ పరీక్షేనా?
శాస్త్రవిజ్ఞానమెంతో పెరిగిన అబలకేది రక్షణ?
సు సమాజము ఉద్భవించుటకు ఏది శిక్షణ?
అగాయిత్యాలు వొలదని దుర్మార్గాలకు సెలవని
మంచి చెడులను విడదీసి మానవతనే బోధించి
సువిశాల భారతికి మనమంత బిడ్డలని
ప్రతిమనిషి తలవాలి మగువే మన తోబుట్టువని

-0-

- మూడగాని మధు

చైతన్య మానవి

# స్వాతంత్ర్య ఫలాలు కొందరికేనా?

సంపాదకీయం...

ఢిల్లీ ఎర్రకోట నుండి 67వ స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలు ఘనంగా జరిగాయి. రెండు ముక్కలైన తెలుగు రాష్ట్రాలు ఆంధ్ర ప్రదేశ్, తెలంగాణా ప్రభుత్వాలు కొత్త తరహాలో కొత్త ప్రదేశాల్లో జెండా పండుగ దినోత్సవాలు జరిపారు. ఈ సందర్భంగా దేశ ప్రధాని, ముఖ్యమంత్రులు చేసిన ప్రసంగాల సారాంశంలో పెద్దగా కొత్తదనమేమీ కనిపించలేదు. 67 వసంతాలు భారత్ నవ నిర్మాణానికి అవసరమైన చర్యలు చేపట్టలేకపోయారు.

దేశ స్వాతంత్ర్యం కోసం ఎందరో వీరుల అశేష త్యాగాల ఫలితమే పరాయి పాలననుండి విముక్తి లభించింది. తెల్లవారి పాలన పోతే మౌలిక సమస్యలు పరిష్కారమవుతాయని ప్రజలు ఆకాంక్షించారు. సమ సమాజ నిర్మాణం, సకల జనుల సౌభాగ్యమనే అసలు లక్ష్యం నెరవేరలేదు. అభివృద్ధి ఫలాలు పేదలకు అందటం లేదు. గత 2 దశాబ్దాలుగా పాలకులు అనుసరించిన ప్రైవేటీకరణ, సరళీకరణ విధానాలతోసాధించిన అభివృద్ధి కన్నా ప్రకృతి వనరులను కొల్లగొట్టడానికి ఎక్కువగా ఉపయోగపడ్డాయి. ఆర్థిక అసమానతలు పెరిగాయి. కార్పొరేట్ శక్తుల హవా నడుస్తోంది. అవినీతి రాజ్యమేలుతోంది. ప్రజా ప్రతినిధులు, బ్యూరోక్రట్లు ప్రజల సంపదను కొల్లగొడుతున్నారు. మానవ హక్కుల ఉల్లంఘనలు యథేచ్ఛగా సాగుతున్నాయి. ఎన్నికలలో డబ్బు, మద్యం వెదజల్లి గెలవటం, మళ్ళీ సంపద పోగు చేయడమనే విష వలయాన్ని విచ్ఛిన్నం చేయలేకపోయాం. తాజా లెక్కల ప్రకారం దేశ సంపదలో సగానికి పైగా బడా కుటుంబాల చేతుల్లోనే ఉందని తేలింది.

కేంద్రంలో సంకీర్ణ కూటమిని ఓడించి పూర్తి మెజారిటీతో బిజెపికి పట్టం కట్టారు. 2నెలల పాలన కాంగ్రెస్ సంస్కరణ విధానాలనే మరింత వేగంగా ముందుకు తెస్తున్నారు.ప్రజల జీవన ప్రమాణాల మెరుగుదల మాట అటుంచి నానాటికీ క్షీణిస్తున్నాయి. పౌష్టికాహార లేమితో రోజుకు ఆరు వేలమంది చిన్నారులు మరణిస్తున్నారు. ఏటా 20 లక్షల మంది పిల్లలు ఆరో పుట్టినరోజు జరుపుకోకుండానే మరణిస్తున్నారు. కేంద్రంలో అధికారంలోకి వచ్చిన బిజెపి ప్రభుత్వం సంక్షేమ పథకాలకు తూట్లు పొడిచి కార్పొరేట్ శక్తుల లాభాలు చేకూర్చే పథక రచన చేస్తోంది. ఆహార భద్రత, ఉపాధి హామీ పథకాలపై సమీక్షలు చేస్తున్నారు. పేదరిక నిర్మూలన గురించి స్వాతంత్ర్య వేడుకలలో భాష్యాలు చెప్పే పాలకులు దినదినాభివృద్ధి అవుతున్న పేదరికం, నిరుద్యోగం గురించి ఊసే ఎత్తరు. ఆరు దశాబ్దాల బూర్జువా పాలనలో కోటీశ్వరులు శత కోటీశ్వరులుగా మారారు. ప్రపంచస్థాయిలో 6 నుంచి 62కి పెరిగారు. ఒక పక్క అర్థాకలితో పేదరికంతో చీకటిలో మగ్గుతున్న భారత్, మరోపక్క వెలిగిపోతున్న భారత్. ప్రపంచ మానవాభివృద్ధి సూచికలో మన దేశం 136వ స్థానంలో ఉంది. ఈనాటికీ 65 శాతం కుటుంబాలకు మరుగుదొడ్ల సౌకర్యం లేదు. లక్షలాది గ్రామాలలో రక్షిత మంచినీళ్ళు లేవు.

అర్ధరాత్రి స్త్రీ ఒంటరిగా నడివీధిలో తిరుగాడిన నాడే దేశ స్వాతంత్ర్యం లభించినట్లు అని గాంధీ ప్రవచనాలు గాలిలో కలిసిపోయాయి. 67 వసంతాల స్వాతంత్ర్య వేడుకలలో ప్రధాని మరియు రాష్ట్రపతి ప్రసంగాలలో మహిళల భద్రత అంశాన్ని నొక్కి వక్కాణించాల్సిన అగత్యమేర్పడింది. అనేక మహిళా ఉద్యమాల ఫలితంగా ఈనాడు మహిళలు శాస్త్ర సాంకేతిక, సమాచార, క్రీడా, కార్పొరేట్ రంగాలలో విజయ కేతనాలు ఎగురవేస్తున్నారు. మరోవైపు బాలికలు, స్త్రీలపై నిరాటంకంగా బహురూపాలలో జరుగుతున్న దాడులు భారత్‌ను తలదించుకునేలా చేస్తున్నాయి. జన్మించే హక్కు జీవించే హక్కు కోసం పోరాటం చేయాల్సిన దుస్థితి ఏర్పడింది.

ఎందరో వీరుల రక్త తర్పణంతో స్వాతంత్ర్యం సాధించుకున్నాం. ఈనాడు రాజ్యం కార్పొరేట్ శక్తుల, బడా పెట్టుబడిదారుల కబంధ హస్తాలలో చిక్కుకుంది. స్వాతంత్ర్య ఫలాలు ప్రజలందరికీ దక్కాలి. ఆర్థిక అసమానతలు, దారిద్ర్యం, నిరుద్యోగం లేని సమ సమాజం కోసం మరో స్వాతంత్ర్య పోరాటానికి సమాయత్తం కావాలి.

**సూక్తి : సమస్యలు వస్తే గందరగోళ పడకు. నువ్వు విజయం సాధించవలసిన పరీక్షలుగా భావించి, వాటిని ఎదుర్కో.**

–మార్క్స్






**అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం రాష్ట్ర కమిటీ**

చిరునామా :
బ్లాక్ నెం. 24, హెచ్ఐజి ఫేజ్ : 2, 1-8-1,
బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ - 500 044.
ఫోన్ : 27605845.
e-mail chaitanyamanavi@gmail.com

సంపాదకులు
**టి.జ్యోతి**

సంపాదక వర్గం
**మల్లు స్వరాజ్యం**
**అల్లూరి మన్మోహిని**
**ఎస్.పుణ్యవతి**
**కె.స్వరూపరాణి**

మేనేజర్
**ఎం.సుధ**

**విరాళం రూ : 10/-**

**ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, అజమాబాద్, హైదరాబాద్ - 500 044.**

***ఈ సంచికలో...***

హింస



# ఇది అత్యాచారాల యుగం

డా॥ బి. విజయభారతి

'స్త్రీలపై అత్యాచారాలు ఎందుకు జరుగుతాయి?' అనే అంశం మీద శాస్త్ర నిపుణులు, వైద్యులు, చరిత్రకారులు రకరకాల అభిప్రాయాలు వ్యక్తం చేశారు. కామం, శారీరక వాంఛ అనేది జీవుల సహజ లక్షణం. తిండి, నిద్రల లాగానే మైధునమూ ప్రాణులకు అవసరం. శారీరక వాంఛలు తీరని కారణంగా అత్యాచారాలకు పాల్పడతారని కొందరంటారు. సెక్స్ కోసం కాకుండా తమ బలాన్ని చూపించుకోవటానికి అత్యాచారాలు చేస్తారనే వాదమూ ఉన్నది. కామవాంఛ సహజమైనదే. అయినా బలాత్కారాల వెనుక అనారోగ్య కారణాలుంటాయంటారు మరికొందరు. ఇప్పటికి వెలుగులోకి వచ్చిన అత్యాచారాల కేసులు పరిశీలిస్తే మానసికంగా ఆరోగ్యంగా ఉన్నవారే ఈ అకృత్యాలకు ఎక్కువగా ఒడిగడుతున్నట్లు స్పష్టపడుతుంది. అత్యాచారాలు చెయ్యటాన్ని ఒక అలవాటుగా సాగిస్తున్న వారూ ఎక్కువగా ఉన్నారని పరిశీలనలు చెబుతున్నాయి.

ఈ పరిస్థితిని ఎదుర్కోవటం ఎలా? ఇప్పటికే ఇదొక సామాజిక జాడ్యంగా కుదురుకున్నది. ఈ రోగానికి నిరోధక మాత్రలు ఎవరు కనిపెట్టాలి? కచ్చితంగా బాధితులే కనిపెట్టాలి. ముందుగా దీనిని ఒక సామాజిక జాడ్యంగా గుర్తించాలి. కుటుంబ స్థాయిలోనే దీన్ని నయం చేయటానికి వ్యవస్థాగతమైన మార్పులు రావాలి. పవిత్రమైన దేశంగా కర్మ భూమిగా పేరొందిన భారతదేశానికి వచ్చిన విదేశీ బాలికలూ ఈ కామ కృత్యాలకు బలి అవుతున్నారంటే ఇక్కడి స్త్రీలు దీనికి ఏదో ఒక పరిష్కారం కనిపెట్టక తప్పదు.

పరస్పర నిందారోపణలతో ఏమీ సాధించలేము. ప్రత్యక్షంగా కార్యరంగంలోకి ప్రవేశించవలసిన అగత్యం ఉన్నది. తమ కర్తవ్యం, బాధ్యత గుర్తించటం- సమాజంలోనూ, కుటుంబంలోనూ స్త్రీ పురుషులు తమ తమ పాత్రలను సమీక్షించుకోవటం ఈ పరిస్థితులలో తప్పనిసరి. పురుషాధిక్యత జరుగుతున్న దానిలో స్పష్టంగానే తెలుస్తున్నది. అక్కా చెల్లెళ్ళతో అశ్లీలంగా ప్రవర్తిస్తున్న సోదరుల గురించీ, కూతుళ్ళను వాడుకుంటున్న తండ్రుల గురించీ పత్రికలలో చదువుతూ ఉంటే దీనికి అడ్డుకట్ట వేయాలంటే కుటుంబంలోనే మౌలికమైన మార్పులు రావాల్సి ఉందని స్పష్టమవుతుంది.



మార్పు ఆలోచనలోనూ, ఆచరణలోనూ అన్నింటిలోను రావలసిందే. శాస్త్రాలపట్ల గుడ్డినమ్మకాలు పెట్టుకోకపోవటం- సాంప్రదాయాలనూ

**స్త్రీ జాతి తమ సేవలకే పుట్టిందనే భావన, నమ్మకం పురుషులకు కలిగించటంలో మన పాత్ర ఎంత? అనేది ప్రతి ఇల్లాలూ ఆలోచించుకోవాల్సిన సమయం ఇది. పూల తీగల లాగా పురుషులను అల్లుకోవలసిన జీవితాలుగా భ్రమలో ఉన్నాం. పురుషుల ఆయురారోగ్యాల కోసం ఉపవాసాలు, పూజలు, వ్రతాలు చేస్తున్నాం. ఎన్నెన్ని చేస్తున్నా స్త్రీలకు కొంచెమైనా విలువ ఉన్నదా? అనేదీ ప్రశ్నించుకోవాలి.**

**హిందూ మతంగానీ ఇతర మతాలు గానీ స్త్రీకి చాలా గౌరవం ఇస్తున్నట్టే చెబుతుంటాయి. ఆ మాటలు ఇంకా నమ్మాలా? పుత్రుడే పున్నామ నరకాన్ని తప్పిస్తాడన్న మూఢనమ్మకాలు ఇంకానా? కొడుకునూ, కూతుర్ని మామూలుగానే సమానంగా పెంచటం అలవాటు చేసుకుందాం. వారిని ఇంతకాలం మగ మహారాజులుగా చూశాం. అందుకు ఫలితంగా ఈనాటి సమాజం ఎలా రూపొందిందో చూస్తున్నాం. ఆడపిల్లలకు భద్రత లేని ఈ సమాజంలో మనకూ బాధ్యత ఉంది. దానిని పునర్నిర్మించుకోవాల్సిన అవసరం కనబడుతూనే ఉంది.**

మత రీతులనూ, కులాచారాలనూ తరచి చూసుకోవటం, హేతుబద్ధంగా ఆలోచించటం అవసరం. పురుషాధిక్యతను అడుగడుగునా ఆలోచించుకోవలసి ఉంది. ఎంత సంపద ఉన్నా తెలివి తేటలు ఉన్నా స్త్రీలు నిరంతర దాస్యంలోనే ఉన్నారు. తెల్లవారి లేచింది మొదలు పురుషులకు అన్ని సేవలూ చేయవలసిందే. ఆడపిల్లలు మగపిల్లలకు అన్నీ అందించవలసిందే. పళ్ళు తోముకోవటానికీ, స్నానానికీ- తినటానికీ, తాగటానికీ అన్నీ చేతికి అందించాలి. "మంచినీళ్ళు" అనగానే భయ భక్తులతో నీళ్ళగ్లాసు అందించి వారు తాగేవరకూ అక్కడే నిలబడి ఆ గ్లాసు అందుకోవలసిందే. ఇంత పరాధీనత అవసరమా? స్త్రీ జాతి తమ సేవలకే పుట్టిందనే భావన, నమ్మకం పురుషులకు కలిగించటంలో మన పాత్ర ఎంత? అనేది ప్రతి ఇల్లాలూ ఆలోచించుకోవాల్సిన సమయం ఇది. పూల తీగల లాగా పురుషులను అల్లుకోవలసిన జీవితాలుగా భ్రమలో ఉన్నాం. పురుషుల ఆయురారోగ్యాల కోసం ఉపవాసాలు, పూజలు, వ్రతాలు చేస్తున్నాం. ఎన్నెన్ని చేస్తున్నా స్త్రీలకు కొంచెమైనా విలువ ఉన్నదా? అనేదీ ప్రశ్నించుకోవాలి.

హిందూ మతంగానీ ఇతర మతాలు గానీ స్త్రీకి చాలా గౌరవం ఇస్తున్నట్టే చెబుతుంటాయి. ఆ మాటలు ఇంకా నమ్మాలా? పుత్రుడే పున్నామ నరకాన్ని తప్పిస్తాడన్న మూఢనమ్మకాలు ఇంకానా? కొడుకునూ, కూతుర్ని మామూలుగానే సమానంగా పెంచటం అలవాటు చేసుకుందాం. వారిని ఇంతకాలం మగ మహారాజులుగా చూశాం. అందుకు ఫలితంగా ఈనాటి సమాజం ఎలా రూపొందిందో చూస్తున్నాం.



ఆడపిల్లలకు భద్రత లేని ఈ సమాజంలో మనకూ బాధ్యత ఉంది. దానిని పునర్నిర్మించుకోవాల్సిన అవసరం కనబడుతూనే ఉంది. కుటుంబ వ్యవస్థకు- కుటుంబ సభ్యుల మధ్య ఆప్యాయతలకూ భంగం రాని విధంగానే ఒక ప్రణాళికను రూపొందించుకోవటం తక్షణ కర్తవ్యం. సామాజిక న్యాయం రాబోయే తరానికి ముఖ్యంగా ఆడపిల్లలకు అందించాల్సిన బాధ్యత ఈ తరం వారిదే.

సమర్ధులైన వారు న్యాయాన్నీ, ధర్మాన్నీ నిలబెట్టాలంటారు పెద్దలు. అందుకు ఎవరో రారు. మనమే అన్యాయాన్ని ప్రశ్నించటం నేర్చుకోవాలి. మహారాష్ట్రలోని చంద్రపూర్ పోలీసు స్టేషన్‌లో 1972లో మధుర అనే పదహారేళ్ల అమ్మాయి అత్యాచారానికి గురైనప్పుడు కేసు విచారించిన న్యాయమూర్తులు స్పందించనే లేదు. మహిళా సంఘాలు, కార్యకర్తలు ఎంత ప్రయత్నించినా నిందితులకు శిక్షపడని సందర్భంలో "వసుధ భగంవార్" అనే మహిళా న్యాయ వాది (1940-10-2-2014) ఢిల్లీ విశ్వవిద్యాలయానికి చెందిన ముగ్గురు న్యాయ శాస్త్ర ప్రొఫెసర్ల సహాయంతో సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తికి బహిరంగ లేఖ పంపి 1979 నాటికి అత్యాచార కేసుల విచారణలో మౌలికమైన మార్పులు తేగలిగారు. స్వయం సహాయమే ఉత్తమ మార్గం. కుటుంబంలోనైనా మనకు మనమే సాధికారత సాధించుకోవాలి.

స్త్రీల పరంగా స్త్రీలనుండి వస్తున్న చైతన్యాన్ని సమాజం సహించలేక పోతున్నది. స్త్రీల పరంగా మౌలికమైన మార్పులు రావాలంటే స్త్రీలే పూనుకోక తప్పదు. స్త్రీల సమస్యలను - వారిపై జరుగుతున్న హింసను తెలిపే పుస్తకాలను సమాచారాన్ని కూడా పురుష సమాజం అడ్డుకుంటున్నది.

కలకత్తాలో ఇటీవల జరిగిన 38వ అంతర్జాతీయ పుస్తక ప్రదర్శనలో "పరిజాయి నారీ" (displaced migrant women) అనే పుస్తకాన్ని అమ్మకుండా ఆపించారట. స్త్రీలపై హింసకు వ్యతిరేకంగా పోరాడుతున్న ఒక ప్రముఖ స్త్రీవాద సంస్థ ప్రచురించిన పుస్తకం అది. స్థానిక మహిళా కమీషన్ అధ్యక్షురాలినీ, ప్రచురణకర్తలనూ అక్కడ అడ్డుకున్నారు. బాధితుల కథనాలు, నిరాశ్రయుల జీవితాలు- నిర్వాసితుల స్థితిగతులూ దాచిపెట్టాలని చూసే సమాజం ఇది. ఈ పురుషస్వామ్య ప్రపంచంలో స్త్రీల పాత్ర ఏమిటి అని ప్రశ్నించుకోవాలి.

2011నాటి జనాభా లెక్కల ప్రకారం భారతదేశంలో వెయ్యిమంది పురుషులకు

**యక్ష రాక్షస జాతుల ప్రజలు స్త్రీల పట్ల గౌరవంగా సౌమ్యంగా ఉండే వారనటానికి రావణుడు గొప్ప ఉదాహరణ. సీతను చెరపట్టినా ఆమెను బలవంతం చేయలేదు. ఆమెపై అత్యాచారమూ చేయలేదు. ఆర్యప్రజలు స్త్రీల పట్ల అంత మర్యాదగా ఉండేవారు కాదేమోననే అనుమానమూ, నమ్మకమూ శూర్పనఖ విషయంలో కలుగుతాయి. "మా రాజ్యంలో మీరెందుకు తిరుగుతున్నారు"? అని అడిగినందుకు ఆమె ముక్కు చెవులు కోశారు రామ లక్ష్మణులు. పైగా ఆమె తమను మోహించిందని కథలు చెప్పారు. పురుషుల ప్రవర్తనలో ఆలోచనల్లో ఆ ధోరణి ఇప్పటికీ కొన్ని కోర్టు తీర్పులలో కనిపిస్తూనే ఉంది.**

సమర్ధులైన వారు న్యాయాన్నీ, ధర్మాన్నీ నిలబెట్టాలంటారు పెద్దలు. అందుకు ఎవరో రారు. మనమే అన్యాయాన్ని ప్రశ్నించటం నేర్చుకోవాలి. మహారాష్ట్రలోని చంద్రపూర్ పోలీసు స్టేషన్‌లో 1972లో మధుర అనే పదహారేళ్ల అమ్మాయి అత్యాచారానికి గురైనప్పుడు కేసు విచారించిన న్యాయమూర్తులు స్పందించనే లేదు. మహిళా సంఘాలు, కార్యకర్తలు ఎంత ప్రయత్నించినా నిందితులకు శిక్షపడని సందర్భంలో "వసుధ భగంవార్" అనే మహిళా న్యాయ వాది (1940-10- 2-2014) ఢిల్లీ విశ్వవిద్యాలయానికి చెందిన ముగ్గురు న్యాయ శాస్త్ర ప్రొఫెసర్ల సహాయంతో సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తికి బహిరంగ లేఖ పంపి 1979 నాటికి అత్యాచార కేసుల విచారణలో మౌలికమైన మార్పులు తేగలిగారు.

943 మంది స్త్రీలున్నారు. వీరిలో బాలికల శాతం ఇంకా తగ్గుతూ ఉంది. ఆరేళ్ళలోపు వయస్సు వారి జనాభా గమనిస్తే వెయ్యికి 939 మందే బాలికలున్నారు. ముందు ముందు ఈ అత్యాచారాలు, హింస ఇంకెంతగా పేట్రేగి పోతాయో ఆలోచిస్తే భయం వేస్తోంది.

స్త్రీల పరంగా వారి సమస్యలు అర్థం చేసుకునే పురుషులు తక్కువ. విధాన నిర్ణయాలలో స్త్రీల పాత్ర, కుటుంబంలో గానీ, రాజకీయాలలో గానీ ప్రభుత్వాలలో గానీ లేని పరిస్థితి. చట్టాలు ఎన్ని వచ్చినా మనుధర్మ శాస్త్రమూ, సంప్రదాయాలూ స్త్రీల జీవితాలను నియంత్రిస్తున్నాయి. సమాన హక్కులు ఓట్ల వరకే- సమాన గౌరవం సమధర్మం లేనేలేవు . స్త్రీలను అసభ్యంగా చూపే సన్నివేశాలు, దృశ్యాలు ప్రకటనలు నిలిపి వేయాలనే ఆందోళనలు ఎన్ని జరిగినా కోర్టులు, ప్రభుత్వాలు ఉదాసీనంగా, నిర్లక్ష్యంగా, బాధ్యతా రహితంగా వ్యవహరించటం మన సమాజంలో కొత్త కాదు.

స్త్రీని భోగవస్తువుగా చూసే ప్రపంచంలో ఇలాంటి అభిప్రాయాలు వింతకాదు. ప్రపంచ సాహిత్యాన్ని తవ్వుకుంటే స్త్రీల పట్ల ఎంత దారుణమైన వ్యవహారాలుండేవో అర్థమవుతుంది. స్త్రీలను సభలలో నగ్నంగా నడిపించి ఆనందించే సంస్కృతి కొన్ని దేశాలలో ఉండేది. అందమైన బాలికలను వేశ్యలుగా నిర్ణయించే పెద్దల సభలూ ఉండేవి. బానిసలైన స్త్రీలను నిండు సభలో వస్త్రాపహరణం చేసి సంతోషపడిన కథలు భారతదేశపు ఇతిహాసాలలో పురాణాలలో ఉన్నాయి. గమనించదగ్గ అంశమేమిటంటే బలాత్కారాలు అనేవి ఆదివాసి, గిరిజన సమూహాలలో తక్కువట. అరుదైన అలాంటి సంఘటన దండకారణ్య రాజ్యాలలో ఒక చోట జరిగిందట. వెంటనే దానికి ప్రతీకారమూ జరిగింది. రాక్షస గురువయిన శుక్రాచార్యుని కూతురు 'అరజ' ఒక వనంలో తపస్సు చేసుకుంటూ ఉంటే దండుడు అనే రాజు ఆమెను బలాత్కరించాడనీ ఆ విషయం తెలిసి శుక్రాచార్యుడు ఆ రాజుని శపించాడనీ, అతని నగరంపై మట్టివాన కురిసి ఆ ప్రాంతం నశించి దండకారణ్యం అయిందనీ ఉత్తర రామచరిత్రలో ఒక కథ ఉంది. స్థానిక యక్ష రాక్షస జాతుల ప్రజలు స్త్రీల పట్ల గౌరవంగా సౌమ్యంగా ఉండే వారనటానికి రావణుడు గొప్ప ఉదాహరణ. సీతను చెరపట్టినా ఆమెను బలవంతం చేయలేదు. ఆమెపై అత్యాచారమూ చేయలేదు. ఆర్యప్రజలు స్త్రీల పట్ల అంత మర్యాదగా ఉండేవారు కాదేమోననే అనుమానమూ, నమ్మకమూ శూర్పనఖ విషయంలో కలుగుతాయి. " మా రాజ్యంలో మీరెందుకు తిరుగుతున్నారు"? అని అడిగినందుకు ఆమె ముక్కు చెవులు కోశారు రామ లక్ష్మణులు. పైగా ఆమె తమను మోహించిందని కథలు చెప్పారు. పురుషుల ప్రవర్తనలో ఆలోచనల్లో ఆ ధోరణి ఇప్పటికీ కొన్ని కోర్టు తీర్పులలో కనిపిస్తూనే ఉంది. అత్యాచారం ఆ స్త్రీల ఇష్ట ప్రకారమే జరిగిందని అధికార వర్గాలు సమర్థించటమూ చాలా కేసులలో విన్నాం. స్త్రీల వస్త్రధారణ గురించీ, వారు తీసుకోవలసిన జాగ్రత్తల గురించీ, పెప్పర్ స్ప్రేల గురించీ ఉపన్యాసాలిచ్చే ప్రభుత్వాలూ, నాయకులూ వారే పెప్పర్ స్ప్రేలు పట్టుకొని తిరుగుతున్న ఈ రోజుల్లో వారినుండి స్త్రీలు తమను తాము రక్షించుకోవటం సాధ్యమయ్యేదేనా? సమూలంగా ఈ వ్యవస్థను నిర్మూలించటం తక్షణ కర్తవ్యం. అన్నిరంగాలలోనూ మార్పు రావాలి. సంఘటితంగా స్త్రీలు ఆలోచించాలి.

చట్టాలూ, మహిళా సంఘాల ఆందోళనలూ పాక్షికంగానే విజయాలు సాధించినా పోరాటం తప్పదు. స్త్రీలపట్ల పురుషుల మనస్తత్వాలలో, ప్రవర్తనా రీతులలో మార్పు కోసం ఎదురు చూడటం కన్నా ఆ మార్పులకు స్త్రీలే శ్రీకారం చుట్టవలసిన సమయం ఇది.

స్త్రీల సమస్యలను అత్యంత సానుభూతితో పరిశీలించిన డా. అంబేడ్కర్

**స్త్రీల సమస్యలను అత్యంత సానుభూతితో పరిశీలించిన డా. అంబేద్కర్ తన సమావేశాలలో తరచుగా స్త్రీలనుద్దేశించి ప్రసంగించి వారికి దిశ నిర్దేశం చేస్తుండేవారు. " స్వతంత్రంగా ఆలోచించండి" అని చెబుతుండేవారు. స్త్రీలకు ఆర్థిక ప్రతిపత్తిని కలిగించే ప్రయత్నంలో ఆయన పార్లమెంట్‌లో హిందూకోడ్ బిల్లు ప్రవేశపెట్టి కొన్ని మౌలికమైన మార్పులు తేవాలనుకున్నప్పుడే సంప్రదాయ సమాజం ఆయనకు సహకరించలేదు. స్త్రీకి ఆర్థిక ప్రతిపత్తి ఉంటే కుటుంబ వ్యవస్థ విచ్ఛిన్నమవుతుందని అప్పటి మేధావులు భయపడ్డారు.**

**స్త్రీల వస్త్రధారణ గురించీ, వారు తీసుకోవలసిన జాగ్రత్తల గురించీ, పెప్పర్ స్ప్రేల గురించీ ఉపన్యాసాలిచ్చే ప్రభుత్వాలూ, నాయకులూ వారే పెప్పర్ స్ప్రేలు పట్టుకొని తిరుగుతున్న ఈ రోజుల్లో వారినుండి స్త్రీలు తమను తాము రక్షించుకోవటం సాధ్యమయ్యేదేనా? సమూలంగా ఈ వ్యవస్థను నిర్మూలించటం తక్షణ కర్తవ్యం. అన్నిరంగాలలోనూ మార్పు రావాలి. సంఘటితంగా స్త్రీలు ఆలోచించాలి.**

తన సమావేశాలలో తరచుగా స్త్రీలనుద్దేశించి ప్రసంగించి వారికి దిశా నిర్దేశం చేస్తుండేవారు. "స్వతంత్రంగా ఆలోచించండి" అని చెబుతుండేవారు. స్త్రీలకు ఆర్థిక ప్రతిపత్తిని కలిగించే ప్రయత్నంలో ఆయన పార్లమెంట్‌లో హిందూకోడ్ బిల్లు ప్రవేశపెట్టి కొన్ని మౌలికమైన మార్పులు తేవాలనుకున్నప్పుడే సంప్రదాయ సమాజం ఆయనకు సహకరించలేదు. స్త్రీకి ఆర్థిక ప్రతిపత్తి ఉంటే కుటుంబ వ్యవస్థ విచ్ఛిన్నమవుతుందని అప్పటి మేధావులు భయపడ్డారు. అనుకున్న ప్రకారం చట్టం తేలేకపోయిన అంబేద్కర్ అసహనంతో తన మంత్రి పదవినే వదులుకున్నారు. కుటుంబంలో పురుషులు అవినీతి పరులూ, వ్యసనపరులూ అయినపుడు వారిని ఎదిరించవచ్చునని అంబేద్కర్ పదే పదే చెప్పేవారు. ఆయన ప్రబోధాల వల్లనే మహారాష్ట్ర మహిళలు ప్రగతి మార్గంలో ముందున్నారు. అలాంటి ప్రబోధాలు ఇచ్చే వారెవరూ ఈనాడు కనిపించటంలేదు. నాయకుల నుండి అవహేళనలు మాత్రమే వినవస్తున్నాయి. కర్తవ్యం స్త్రీలే నిర్ణయించుకోవలసి ఉంది.

"భర్త ఎంతటి వ్యసనపరుడైనా మాటవినాలి" అని హిందూ మతం చెబుతోంది. సతీ సుమతి కథ-ఆడపిల్లలకు నూరిపోసింది. ఆ కథ గుర్తు చేసుకోవలసిందే. కౌశికుడనే వాని భార్య సుమతి. వేశ్యాలోలుడయిన-రోగగ్రస్తుడయిన-భర్తను, సుమతి ఒక తట్టలో పెట్టుకుని నెత్తిన పెట్టుకుని మోసుకుంటూ అతడి వేశ్యా ప్రియురాలి దగ్గరకు తీసుకువెళ్ళిందట. దారిలో చీకట్లో ఆమె మాండవ్యుడనే వాని భుజానికి తగిలింది. ఆ మాండవ్యుడు మరణ శిక్ష అనుభవిస్తున్న దుర్మార్గుడు. ఏ కారణం చేతనో అతనిని రాజభటులు కొరత వేశారు. సుమతి భుజమో, ఆమె నెత్తిమీద తట్టనో అతనికి తగిలి అతని గాయం రేగింది. కొరత వేయటం అంటే మనిషిని నిలువుగా శూలానికి గుచ్చి వేలాడదీయటం. ప్రాణం పోయే వరకూ ఆ శూలాన్ని అలాగే ఉంచుతారు.



అలాంటి మాండవ్యుడు చీకట్లో ఎవరో తగిలి గాయాలు రేగటంతో కోపంతో శపించాడట "నా పుండు రేపిన వాడు సూర్యోదయానికి మరణిస్తాడు" అనేది శాపం. ఆ మాట సుమతి విన్నది. "సూర్యుడు ఎప్పటికీ ఉదయించకూడదు" అని తిరుగు శాపం ఇచ్చింది. "నేనే పతివ్రతనయితే" వంటి భావాలు ఎలాగూ ఉంటాయి కదా. సూర్యుడు ఉదయించక లోకాలన్నీ అల్లకల్లోలమై పతివ్రత అయిన అనసూయను ఆశ్రయిస్తే ఆమె సుమతికి సర్దిచెప్పటం, సూర్యుడిని ఉదయించవలసిందిగా సుమతి కోరటం, మరణించిన కౌశికుడిని అనసూయ బ్రతికించటం వంటి విశేషాలతో ఉన్న ఈ కథ మార్కండేయ పురాణంలో ఉంది.

శిక్షకు గురైన మాండవ్యునికి కూడా శపించే శక్తి వుంది. అది పురుషాధిక్యత. భార్య చేత సేవలు చేయించుకోవటం కౌశికుని హక్కు. పురుషుడు కాబట్టి. సుమతి, అనసూయలకు పాతివ్రత్య మహిమ చేతనే శాపానుగ్రహ శక్తి వచ్చిందనటం పెద్ద కుట్ర. వీరి సేవలు పురుషులకే ఉపయోగపడ్డాయి. ఇలాంటి కథలను జీర్ణించుకున్న సమాజ సంప్రదాయాలను ప్రశ్నించవద్దా? సమాన హక్కు-సమాన హోదా సాధించటం ఎక్కడికక్కడ ఇంటినుండే ఆరంభంకావాలి. స్త్రీలంతా ఒకరోజు తమ దినచర్యను సమీక్షించుకుంటే తాము పురుషాధిక్య బంధనాలలో ఎంతగా బందీలయ్యారో అర్థమవుతుంది. నిదానంగానే అయినా ఈ బంధనాలలో మార్పు రావాలి. హిందూపురాణాలే ముందుకు తెచ్చిన, శక్తి స్వరూపిణులను ఆదర్శంగా తీసుకోవాలి. సృష్టి అంతటా వైవిధ్యం, భిన్నత్వం ఉన్నాయని అర్థం చేసుకోవాలి. సమయోచితంగా సాగిపోవాలి. ●

**సుమతి, అనసూయలకు పాతివ్రత్య మహిమ చేతనే శాపానుగ్రహ శక్తి వచ్చిందనటం పెద్ద కుట్ర. వీరి సేవలు పురుషులకే ఉపయోగపడ్డాయి. ఇలాంటి కథలను జీర్ణించుకున్న సమాజ సంప్రదాయాలను ప్రశ్నించవద్దా? సమాన హక్కు-సమాన హోదా సాధించటం ఎక్కడికక్కడ ఇంటినుండే ఆరంభంకావాలి. స్త్రీలంతా ఒకరోజు తమ దినచర్యను సమీక్షించుకుంటే తాము పురుషాధిక్య బంధనాలలో ఎంతగా బందీలయ్యారో అర్థమవుతుంది. నిదానంగానే అయినా ఈ బంధనాలలో మార్పు రావాలి.**

# పెళ్లి కోసం ప్రకటన

అందం, మంచితనం, ఉన్నత విద్య, విశాల భావాలు, పెద్ద ఉద్యోగం, మంచిజీతం గల ఈ అమ్మాయికి, ఈ లక్షణాలన్నీ తనకీ ఉన్న వరుడు కావలెను.

## అమ్మాయి వివరాలు

| | | |
|---|---|---|
| పేరు | : | **సృజన** |
| పుట్టిన తేది | : | **జూన్ తొమ్మిది, 1989** |
| హైట్ | : | **5.5** |
| వెయిట్ | : | **54 కేజీలు** |
| రంగు | : | **తెలుపు** |
| విద్యార్హత | : | **ఎమ్‌టెక్ కంప్యూటర్స్ ఫ్రమ్ ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్, బెంగుళూరు.** |
| వృత్తి | : | **సీనియర్ కంప్యూటర్ ఇంజనీర్/సైంటిస్ట్. యాహూ కంపెనీ, బెంగుళూరు.** |
| ఆదాయాన్ని వినియోగించే మార్గాలు | : | **1. సుఖవంతమైన, ఆరోగ్యవంతమైన జీవితం కోసం**<br>**2. కళలను అభివృద్ధి పరుచుకోవడం కోసం.**<br>**3. సమాజ సేవ కోసం.** |
| లైఫ్ కాన్సెప్ట్ | : | **నిరాడంబర జీవనం, ఉన్నత ఆలోచనా దృక్పథం.** |
| తల్లిదండ్రులు | : | **డా॥ధవళ లక్ష్మీవిద్య, డా॥ఓరుగంటి సత్యనారాయణ డాక్టర్లు, సామ్యవాదులు. కాకినాడ, రంగరాయ మెడికల్ కాలేజ్‌లో ప్రొఫెసర్లు** |

**వరుడిలో ఆశించే లక్షణాలు**

1. విద్యాధికుడు
2. చదువుకి తగ్గ ఉద్యోగం, సంపాదన కలవాడు.
3. ఆలోచనా దృక్పథం : సామ్యవాద, స్త్రీ-పురుష సమానత్వ, నాస్తిక దృక్పథం
4. ఉండకూడని చెడు అలవాట్లు : తాగుడు, సిగరెట్, జూదం, షేర్లు, స్త్రీ వ్యసనం మొదలగునవి.

**ఇలాంటి వివాహాన్ని కోరుకుంటుంది**

1. కట్నకానుకలు, లాంఛనాలు ఆశించకూడదు.
2. అతి నిరాడంబరమైన రిజిష్టరు పెళ్లి.
3. కులం పట్టింపు లేదు.

**సంప్రదించుటకు**

1. ఫోన్ నెం : 0884 2366476
9246691476
9849796476

2. ఇ.మెయిల్ : dr_dlvidhya@yahoo.com

3. పోస్టల్ ఎడ్రస్ : **8-21-33, వీర సూర్య టవర్స్, పూళ్ళవారి వీధి, గాంధీనగరం, కాకినాడ - 533004**





# యుమ షెర్పకు న్యాయం జరగాలి...

## యదార్థ ఘటన

**మహిళల శరీర అవయవాలతో వ్యాపారానికి స్వస్తి పలకాలి**

- సుధా సుందర రామన్

వైద్య ప్రక్రియ ద్వారా తన శరీరం నుండి అండాలను సేకరించే క్రమంలో యుమ షెర్ప అనే మహిళ న్యూఢిల్లీలోని లజపత్ నగర్‌లో 2014 జనవరి 29న మరణించింది. అండదానం కార్యక్రమంలో భాగంగా ఒక ప్రైవేటు ఆసుపత్రి నిర్వహిస్తున్న ప్రక్రియలో ఈ ఘటన జరిగింది.

కృత్రిమ గర్భధారణ ద్వారా శిశువును పొందేందుకు కావలసిన అండాలను దానం చేసేందుకు యుమను కొంతమంది ఏజెంట్లు ఒప్పించారు. ఈ సంవత్సరం ప్రారంభంలో ఆమె నుండి అండాలను సేకరించే ప్రక్రియ ప్రారంభమయ్యింది. ఈ క్రమంలో ఆమెకు ఇచ్చే ఇంజక్షన్‌ల వల్ల ఆరోగ్యం దెబ్బతిని ఆమె చాలా అసౌకర్యానికి గురైంది. దానితో ఆమె దానినుండి తప్పుకోవాలని కోరుకుంది. కానీ ఆ ఆసుపత్రిలోని డాక్టర్ ఇప్పటికే సమయం మించిపోయిందనీ, ఇప్పుడు అలా తప్పుకోవడానికి వీలు కాదనీ చెప్పారు.

అండాలను సేకరించే ఆఖరిదశ ముగిసిన తరువాత ఆమెను రికవరీ రూముకు మార్చారు. భర్త సంజురాణా ఆమెను తీసుకెళ్ళడానికి అక్కడికి వచ్చేటప్పటికి ఆమె అచేతనంగా పడివుంది. దానితో ఆయన అక్కడి సిబ్బందికి విషయం చెప్పగా ఆమెకు కొన్ని మందులు ఇచ్చామనీ అందువలన ఆమె నిద్ర పోతుండవచ్చునీ చెప్పారు. ఒక గంట తరువాత కూడ ఆమె అదే స్థితిలో వుండడంతో సంజు అక్కడి సిబ్బందిని వత్తిడి చేసి ఆమెను పరీక్షించాలని కోరాడు. అప్పటికే సమయం మించిపోయింది. ఆమె కోలుకోవడానికి ఎన్ని ప్రయత్నాలు చేసినప్పటికీ, కొన్ని గంటల తరువాత ఆమె చనిపోయింది. ఢిల్లీలోని జనవాది మహిళా సమితి ( JMS) ఈ విషయంలో జోక్యం చేసుకొని అతికష్టంపై ఒక ఫిర్యాదు పోలీసులతో నమోదు చేయించింది. తరువాత ఎయిమ్స్ (AIIMS) నుండి ఒక వైద్య బృందం ప్రాథమిక పోస్ట్‌మార్టమ్ నివేదిక ఇచ్చింది. ఫోరెన్సిక్ ప్రయోగశాలకు సంబంధించిన నివేదిక ఇంకా అందలేదు. ఆ ఆసుపత్రిలో జరిగిన దోషాలపై ఇప్పటివరకూ ఎలాంటి చర్య తీసుకోలేదు. వైద్య ప్రక్రియలో నిర్లక్ష్యంగా వ్యవహరించిన దోషులపై FIR కూడా నమోదు కాలేదు.

ఐద్వా, JMS, NFIW సామా, సహేలి మరియు JWP తదితర అన్ని మహిళా సంఘాలతో కూడిన ప్రతినిధి బృందం సంజుతో కలిసి అక్కడి స్పెషల్ DCP ని ఫిబ్రవరి 25న కలిశారు. నిర్ణీత గడువులోగా దర్యాప్తు పూర్తిచేసి యుమ మరణానికి కారణమైన దోషులపై చర్యలు తీసుకోవాలని ఆయనను కోరారు.

ఒక యువతి తన యవ్వన ప్రాయంలో ఇంత దారుణమైన పరిస్థితిలో మరణించడంతో అండదానం, దానికి సంబంధించిన IVF పరిజ్ఞానం మరియు అద్దె గర్భాలకు సంబంధించిన వ్యాపారంలో డబ్బు పాత్ర, వ్యాపారతత్వం స్పష్టంగా బయటపడ్డాయి.

**భారతదేశంలో IVF సర్వీసులు ఎక్కువ షరతులు లేకుండానే అందుబాటులో వున్నాయి. వీటి ఖరీదుకూడా తక్కువగానే వుంటుంది. దీనికి అవసరమైన నైపుణ్యం కలిగిన భారతదేశంలోని డాక్టర్లు తక్కువ ధరలకే తమసేవలందిస్తున్నారు. అందువలన భారతదేశం కృత్రిమ గర్భధారణకు అద్దె గర్భాశయాల వ్యాపారానికి ఒక ఆకర్షణీయమైన ప్రాంతంగా మారింది. ఈ సంతాన సాఫల్యతకు సంబంధించిన వ్యాపారంలో వస్తున్న అపారమైన లాభాలను అంచనా వేయడానికి సరైన అధికారిక రికార్డులు అందుబాటులో లేవు. కానీ ఇందులో బిలియన్ల డాలర్ల వ్యాపారం జరుగుతుందనేది వాస్తవం.**

భారతదేశంలో అతివేగంగా పెరుగుతున్న, లాభదాయకమైన వ్యాపారంగా ఈ ప్రత్యుత్పత్తి సహాయక సేవలు విస్తరిస్తున్నాయి. ఈ ప్రైవేటు ఆసుపత్రులు పట్టణ ప్రాంతాల్లోనే కాకుండా చిన్న పట్టణాలకూ వాటి చుట్టూవున్న పల్లెలకు కూడా విస్తరిస్తున్నాయి. పిల్లలులేని వారికి చేస్తున్న సహాయక సేవల ముసుగులో మానవ హక్కులను ఉల్లంఘిస్తూ ఇబ్బడి ముబ్బడిగా పెరుగుతున్న ఈ అద్దెగర్భాల వ్యాపారాన్ని అడ్డుకోవాల్సిన అవసరం వుంది. అదుపులోలేని వ్యాపార ప్రయోజనాలకు బలైపోతున్న మహిళలను రక్షించేందుకు పూనుకోవాలి.

**నియంత్రణలో లోపం**

కృత్రిమ గర్భధారణకు సంబంధించిన సహాయ ప్రత్యుత్పత్తి సాంకేతిక పరిజ్ఞానం (ART) యొక్క అభివృద్ధి దాదాపు మొత్తంగా ప్రైవేటు రంగంలోనే జరిగింది. దీనిని నియంత్రించేందుకు మానవ అవయవాల అమ్మకానికీ, రక్తం అమ్మకానికీ వున్న చట్టాల లాంటివి ఏవీ లేవు. ICMR ఒక నియమావళి పెట్టింది. కానీ అది చాలా వరకూ అమలు కావడం లేదు. ఏ జవాబుదారీతనం లేకుండా, ఎటువంటి నీతి నిజాయితీ లేకుండా మహిళల ఆరోగ్యంపై పడే ప్రభావంపై ఏ అజమాయిషీ లేకుండా తమ ఇష్టానుసారంగా యాజమాన్యాలు ఈ ఆసుపత్రులను నడుపుతున్నాయి. కేంద్ర ప్రభుత్వం వద్ద పెండింగ్‌లో వున్న 2013 ఆక్ట్ బిల్లు (అసిస్టెడ్ రిప్రొడక్టివ్ 'టెక్నాలజీ ART) ముసాయిదాలో మహిళలకు సంబంధించిన అంశాలలో ఎటువంటి సానుకూలతా లేదు. అండాలు దానం చేసే మహిళలకు గర్భం అద్దెకిచ్చే తల్లులకు కావలసిన రక్షణకు సంబంధించిన అంశాలు ఈ బిల్లులో లేవు. ముఖ్యంగా వైద్యపరంగా వారు ఎదుర్కొనే సమస్యలకు సంబంధించి మొత్తం ముసాయిదా బిల్లులో "మరణం" గురించిన ప్రస్తావనే లేదు. అనైతికమైన విధానాల ద్వారా సాగుతున్న ఈ వ్యాపారం వలన దారుణంగా నష్టపోతున్న మహిళలను రక్షించాలంటే ఒక సమగ్రమైన, పటిష్టమైన చట్టం అవసరం ఎంతైనా వుంది.

నేటి ప్రపంచీకరణ, సరళీకరణల యుగంలో నియంత్రణలేని ఈ రంగం ఒక పెద్ద వ్యాపార అవకాశంగా మారింది. పాలకులు కూడా దీన్ని పెంచి పోషిస్తున్నారు. అభివృద్ధి చెందిన దేశాలైన అమెరికా, కెనడా, యూరప్‌లాంటి చాలాదేశాల్లో ఈ రంగాన్ని వ్యాపారంగా మార్చడానికి వీలులేకుండా అనేక నియంత్రణలు వున్నాయి. కానీ భారతదేశంలో IVF సర్వీసులు ఎక్కువ షరతులు లేకుండానే అందుబాటులో వున్నాయి. వీటి ఖరీదుకూడా తక్కువగానే వుంటుంది. దీనికి అవసరమైన నైపుణ్యం కలిగిన భారతదేశంలోని డాక్టర్లు తక్కువ ధరలకే తమసేవలందిస్తున్నారు. అందువలన భారతదేశం కృత్రిమ గర్భధారణకు అద్దె గర్భాశయాల వ్యాపారానికి ఒక ఆకర్షణీయమైన ప్రాంతంగా మారింది. ఈ సంతాన సాఫల్యతకు సంబంధించిన వ్యాపారంలో వస్తున్న అపారమైన లాభాలను అంచనా వేయడానికి సరైన అధికారిక రికార్డులు అందుబాటులో లేవు. కానీ ఇందులో బిలియన్ల డాలర్ల వ్యాపారం జరుగుతుందనేది వాస్తవం. ఈ రంగంలో సేవలందిస్తున్న మహిళలకు ఎటువంటి రక్షణా లేదు. తమ ఇష్టానుసారంగా ఈ సేవలు అందించే మహిళలు కొంతమంది వుండవచ్చు. కానీ తమ గర్భసంచులను అద్దెకిచ్చే మహిళల్లో చాలామంది ఆర్థికంగా వెనుకబడిన కుటుంబాలకు చెందిన వారై డబ్బు చాలా అత్యవసరమైవున్న వారై వుంటున్నారు. ముఖ్యంగా దారిద్ర్యం మరియు పితృస్వామ్య ఆధిపత్యానికి గురవుతున్న మహిళలు ఈ వాణిజ్య ప్రయోజనాలకు బలవుతున్నారు. ఈ మధ్యకాలంలో తమకు కానీ తమ పిల్లలకు కానీ బాగా చదువుకునే అవకాశాలు కావాలనే ఆశతో మహిళలు ప్రమాదకరమైన ఇటువంటి దారులను వెతుక్కుంటున్నారు. (ఉదా॥తన 3సం॥ కూతురుకు ఢిల్లీలో మంచి విద్య అందించాలని యుమ షెర్ప ఆశించింది.)

**మహిళల ఆరోగ్యం పట్ల నిర్లక్ష్యం**

ఈ సేవలు అందించే మహిళల ఆరోగ్యం పట్లకానీ వారు ఎదుర్కొనే సమస్యల తీవ్రత పట్లకానీ ఏమాత్రం శ్రద్ధ చూపడం లేదు. కృత్రిమ గర్భధారణలో మహిళలు క్లిష్టమైన హార్మోన్ల చికిత్స

**ఈ రంగంలో సేవలందిస్తున్న మహిళలకు ఎటువంటి రక్షణా లేదు. తమ ఇష్టానుసారంగా ఈ సేవలు అందించే మహిళలు కొంతమంది వుండవచ్చు. కానీ తమ గర్భసంచులను అద్దెకిచ్చే మహిళల్లో చాలామంది ఆర్థికంగా వెనుకబడిన కుటుంబాలకు చెందిన వారు డబ్బు చాలా అత్యవసరమైవున్న వారే వుంటున్నారు. ముఖ్యంగా దారిద్ర్యం పితృస్వామ్య ఆధిపత్యానికి గురవుతున్న మహిళలు ఈ వాణిజ్య ప్రయోజనాలకు బలవుతున్నారు. ఈ మధ్యకాలంలో తమకు కానీ తమ పిల్లలకు కానీ బాగా చదువుకునే అవకాశాలు కావాలనే ఆశతో మహిళలు ప్రమాదకరమైన ఇటువంటి దారులను వెతుక్కుంటున్నారు.**

**కృత్రిమ గర్భధారణలో మహిళలు క్లిష్టమైన హార్మోన్ల చికిత్స పొందాల్సి వుంటుంది. దీనివలన వారు అనేక రకాల ఆరోగ్య సమస్యలు ఎదుర్కోవాల్సి వస్తుంది. ఈ క్రమంలో గర్భస్రావం కావడం, బహుళ పిండాలు ఏర్పడటం, గర్భ విచ్ఛిత్తి కావడం, గర్భసంచి బయట పిండనిర్మాణం లాంటి పలు రకాల సమస్యలు ఎదురుకావచ్చు. పిండాన్ని వేరొక గర్భంలో అమర్చినపుడు గర్భస్థ శిశువులో జెనెటిక్ లోపాలు ఏర్పడవచ్చు. అలాంటి పరిస్థితులలో గర్భస్రావం చేయాల్సి రావచ్చు లేదా లోపాలతోవున్న శిశువుకు జన్మనివ్వాల్సి రావచ్చు. దీర్ఘకాలం జరిపే తీవ్రమైన హార్మోన్ల చికిత్సలు మహిళల ఆరోగ్యంపై ఎలాంటి ప్రభావం చూపుతాయనే అంశంపై సరైన అధ్యయనంలేదు. అంతేకాక తాము జన్మనిచ్చిన శిశువును వేరొకరికి అప్పగించే పరిస్థితిలో మహిళలు ఎదుర్కొనే మానసిక సంఘర్షణ గురించి కూడా ఎవరూ పట్టించుకోవడం లేదు.**

పొందాల్సి వుంటుంది. దీనివలన వారు అనేక రకాల ఆరోగ్య సమస్యలు ఎదుర్కోవాల్సి వస్తుంది. ఈ క్రమంలో గర్భస్రావం కావడం, బహుళ పిండాలు ఏర్పడటం, గర్భ విచ్ఛిత్తి కావడం, గర్భసంచి బయట పిండనిర్మాణం లాంటి పలు రకాల సమస్యలు ఎదురుకావచ్చు. పిండాన్ని వేరొక గర్భంలో అమర్చినపుడు గర్భస్థ శిశువులో జెనెటిక్ లోపాలు ఏర్పడవచ్చు. అలాంటి పరిస్థితులలో గర్భస్రావం చేయాల్సి రావచ్చు లేదా లోపాలతోవున్న శిశువుకు జన్మనివ్వాల్సి రావచ్చు. దీర్ఘకాలం జరిపే తీవ్రమైన హార్మోన్ల చికిత్సలు మహిళల ఆరోగ్యంపై ఎలాంటి ప్రభావం చూపుతాయనే అంశంపై సరైన అధ్యయనంలేదు. అంతేకాక తాము జన్మనిచ్చిన శిశువును వేరొకరికి అప్పగించే పరిస్థితిలో మహిళలు ఎదుర్కొనే మానసిక సంఘర్షణ గురించి కూడా ఎవరూ పట్టించుకోవడం లేదు. మహిళలు ఎదుర్కొనే పర్యవసానాల గురించి ఎటువంటి ఆలోచనా లేకుండానే వారి శరీరాలను ప్రపంచ మార్కెట్లోకి తీసుకురావడం జరిగింది. నిజానికి అసలు ఇటువంటి వ్యాపారీకరణ కోరుకోదగినదేనా? అంగీకరించదగినదేనా? అనే అంశంపై చర్చ జరగాలి.

భారతదేశంలో గర్భాశయాలతో జరిగే వ్యాపారం దాపరికంతో జరిగే వ్యాపారంగా ఇంకా ఎంతోకాలం సాగదు. పెద్ద పెద్ద ప్రకటనలతో జరిగే ఒక బహిరంగ వ్యాపారంగా నేడు ఇది వుంది. సంతాన సాఫల్య కేంద్రాలు ఒకవైపు పిల్లలులేని దంపతులను బహిరంగంగా ఆహ్వానిస్తూనే ఇంకోవైపు 25-30సం॥ మధ్య వయస్కులైన మహిళలను ఇటువంటి సేవలు అందించడానికి చేరాల్సిందిగా కోరుతున్నాయి. తమ శరీరాలను వాడుకొనే అవకాశం ఇవ్వడం అనేది మహిళలకు సులభంగా డబ్బు సంపాదించే మార్గంగా చూవబడుతున్నది. నిరుద్యోగులైన మహిళలకు ఆదాయం పొందే మార్గం చూపినందుకు తృప్తిగా వుందని గుజరాత్‌లో పేరుపొందిన ఆరోగ్యనిపుణులు ఒక ప్రాచుర్యం పొందిన ఇంటర్వ్యూలో చెప్పడం ఆశ్చర్యం కలిగిస్తుంది.

మాతృత్వం ఒక వరమనీ, పిల్లలు లేకపోవడం ఒక శాపమనీ భారతదేశ సాంప్రదాయంలో బాగా నాటుకుపోయిన భావజాలం. వివాహిత మహిళ ఒక బిడ్డకు జన్మనిస్తే అదికూడ ఒక మగబిడ్డకు జన్మనిస్తే ఆమెకు గౌరవం, హోదా పెరుగుతాయి. అదే సంతానం కలుగని మహిళ అయితే సాంఘికంగా, ఆర్థికంగా, మానసికంగా ఎంతో ఒత్తిడికి గురవ్వాల్సి వస్తుంది. సంతానలేమిని పోగొట్టుకోవడానికి జరిగే క్రతువులన్నీకూడా మహిళలతోనే చేయిస్తారు. కానీ పురుషులకు అవి ఎప్పుడూ వర్తించవు. గతంలో వేరే మార్గాలేమి లేనపుడు బంధువుల పిల్లలనే దత్తత తీసుకోవడం ద్వారా అందరూ తృప్తిగా వుండేవారు. ఇటీవల కాలంలో పిల్లలు లేని దంపతులు అనాథ పిల్లలను కానీ, లేక వదిలి వేయబడిన పిల్లలను కానీ పెంచుకోవడం మొదలుపెట్టారు. కానీ ఇప్పుడు ఈ సహాయక ప్రత్యుత్పత్తి సేవలు (ART) అందుబాటులోకి వచ్చిన తరువాత వైద్యపరమైన ఒక మాంత్రిక మార్గంగా ఇది ముందుకొచ్చింది. దీనితో వేరే పిల్లలను దత్తత తీసుకోవడమనేది ద్వితీయ మార్గంగా మారిపోయింది. కృత్రిమ గర్భధారణ మహిళల శరీరాలపై వత్తిడిని మరింత పెంచింది. శిశువు కుటుంబంలోని భాగంగా మాత్రమే రావాలనే కోరిక మరింత పెరిగింది. ఈ వైద్య ప్రక్రియలోనే లింగ నిర్ధారణ కూడా జరుపుతున్నారు.

**కృత్రిమ గర్భధారణకు సంబంధించిన IVF ప్రక్రియ చాలా ఖర్చుతో కూడుకున్నదే కాక వీటి సక్సెస్ రేటు కూడా తక్కువే. దీర్ఘకాలం సాగే ఈ చికిత్స వలన కుటుంబాలపై అధిక ఆర్థిక భారం పడుతుంది. ART పరిశ్రమగా చెప్పబడే ఈ వ్యాపారంలో అండదానం చేసే మహిళలకు కానీ గర్భాశయాన్ని అద్దెకిచ్చే తల్లికి కానీ పెద్ద ప్రయోజనమేమి ఉండడం లేదు. కొన్ని రిపోర్టులను పరిశీలిస్తే ఈ ఆసుపత్రులు ఒక మహిళ నుండి ఒక ఋతుక్రమంలో 25నుండి 30 అండాలను సేకరిస్తారు. వారికి 20,000 నుండి 25,000 వేల వరకూ చెల్లిస్తారు. వినియోగదారుల వద్దనుండి ఒకసారి ఒక అండంతో చేసే చికిత్సకే 50,000 రూ॥లను వసూలు చేస్తారు. ఒకసారి అండ సేకరణ చేసే క్రమంలోనే ఆసుపత్రులకు 20 అండాల వరకూ వచ్చిన రేటు లాభంగా మిగులుతుంది.**

### ఖరీదు ఎంత

కృత్రిమ గర్భధారణకు సంబంధించిన IVF ప్రక్రియ చాలా ఖర్చుతో కూడుకున్నదే కాక వీటి సక్సెస్ రేటు కూడా తక్కువే. దీర్ఘకాలం సాగే ఈ చికిత్స వలన కుటుంబాలపై అధిక ఆర్థిక భారం పడుతుంది. ART పరిశ్రమగా చెప్పబడే ఈ వ్యాపారంలో అండదానం చేసే మహిళలకు

**తరువాయి 16వ పేజీలో**



# అంజలీదేవి

- డా॥ వకుళాభరణం లలిత

అంజలి అనగానే మనకు స్ఫురించే లవకుశ సినిమాలోని ఓ అమ్మ లేక తెలుగు వారి సీతమ్మ. ఎనిమిదేళ్ళ వయస్సులోనే రంగస్థల నటిగా కెరియర్ ప్రారంభించిన అంజలీదేవి అసలు పేరు అంజనీదేవి. 1927 ఆగస్టు 24న తూర్పు గోదావరి జిల్లా పెద్దాపురంలో నూకయ్య, సత్యవతి దంపతులకు జన్మించారు. వాళ్లది వ్యవసాయ కుటుంబం. చిన్నతనంలోనే ఆవెుకు నటనపై ఆసక్తి ఉండేది. అందులోను పెద్దాపురం ఆ రోజుల్లో నాటక ప్రదర్శనలకు పెట్టింది పేరు.

దానికి తోడు తండ్రి నూకయ్యకు ఆప్తమిత్రుడు ఆదినారాయణరావు. ఆయన కాకినాడలోని 'యంగ్‌మెన్స్ హ్యాపీక్లబ్ 'లో కీలకమైన వ్యక్తి కావటంతో అంజలిని తీర్చిదిద్దే బాధ్యత వహించాడు. దాంతో అంజలిదేవి బాధ్యతను ఆయన వహించడం, అంజలీ దేవి 'సత్యహరిశ్చంద్ర నాటకంలో లోహితాస్యుడి' పాత్ర పోషించడం జరిగింది. ఆ తర్వాత స్ట్రీట్ సింగర్, లోభి, ఖిల్జీ రాజపత్రం పలు నాటకాల్లో వెంటవెంటనే పాత్రలు లభించాయి. 100 రూపాయల వేతనంతో ఆ క్లబ్‌లో శాశ్వత హీరోయిన్‌గా ఎంపికయ్యారు. స్ట్రీట్ సింగర్‌లో యస్.వి. రంగారావు సరసన హీరోయిన్‌గా నటించారు. పన్నెండేళ్ల వయస్సులో ఆదినారాయణరావుతో వివాహం. వివాహ షరతు 'పెళ్ళయ్యాక కూడా తాను నటించడానికి అంగీకరిస్తేనే పెళ్లి' , అని ఆదినారాయణరావు అంగీకారంతో వివాహం జరిగింది. నూతన దంపతులు మద్రాసు చేరారు. ఆనాటి ప్రముఖ దర్శకుడు చిత్తజల్లు పుల్లయ్య 'గొల్లభామ' సినిమాకు అంజలి సరిపోతుందని రేలంగి చేత వార్త పంపాడు. అదొక వ్యాంప్ పాత్ర. వరసగా అట్లాంటి పాత్రలే లభించాయి. ' కీలు గుఱ్ఱం'లో రాక్షసి పాత్రలో ద్విపాత్రాభినయం అంటే పగలు అందమైన అమ్మాయిగాను, రాత్రి రాక్షసిగాను నటించారు. అందులో ఆమెపాత్ర అద్భుతం.అంతటితో ఆగిపోలేదు. అప్పుడే వచ్చిన 'శ్రీ లక్ష్మమ్మ కథ'లో హీరోయిన్‌గా నాగేశ్వరరావుతో నటించారు. 'పల్లెటూరి పిల్లలో' కూడా ప్రధానమైన పాత్రను పోషించారు. దాంతో దశ తిరిగింది. నిర్దోషి, అనార్కలి, సువర్ణసుందరి, స్వర్ణమంజరి, జయభేరి, సతీ సక్కుబాయి, చరణదాసీ, భక్తతుకారాం ఒకటేమిటి? ఎన్నో సినిమాల్లో ముఖ్యపాత్రలు పోషించారు. 'లవకుశ' చిత్రం ఆమె జీవితంలో కలికితురాయి. ఆమెను చిరంజీవిని చేసింది ఆ పాత్రే. సీత అనగానే మనకు స్ఫురించేది అంజలీ దేవి మాత్రమే. ఇది ఆమె జీవితంలో చెరగని ముద్ర వేసింది.

**ఏ పాత్రలో నటించినా, ఆ పాత్రలో పూర్తిగా లీనమైపోయేది ఆమె. నటన పట్ల ఆమె నిబద్ధత అద్వితీయం. 60 సంవత్సరాల పాటు నటించి, దాదాపు 500 సినిమాల్లో వైవిధ్య భరితమైన పాత్రలు పోషించిందంటే ఆమె నటన ఎంత విశిష్టమైందో మనం అర్థం చేసుకోవచ్చు. తెలుగు, తమిళ చిత్రాలతోపాటు హిందీలో 30 సినిమాల్లో నటించి ప్రేక్షకులను మెప్పించిన ఘనత అంజలీదేవిది.**

ఇవికాక 'ఐడివంతులు', 'చెంచులక్ష్మి', 'దేవత', 'రంగులరాట్నం', ' బృందావనం', 'అన్నా వదిన', ' పోలీసు అల్లుడు' సినిమాలలోనూ నటించారు. దేవతగా, నృత్య కళాకారిణిగా, రాక్షసిగా, సాధారణ గృహిణిగా, అమ్మమ్మగా, నాయనమ్మగా, ఎన్నో పాత్రలు పోషించింది. "చెట్టు లెక్కగలవా, ఓ నరహరి గుట్టలెక్కగలవా, చెట్టులెక్కి ఆ చిటారు కొమ్మన చిగురు కోయగలవా" అంటూ కవ్వించే పాటలు ఎన్నో ఆమెకు పేరు ప్రఖ్యాతులు తెచ్చాయి. అందులోను తెలుగు సినీ రంగంలో మొట్ట మొదట వచ్చిన హీరోయిన్ అంజలీదేవి.

ఏ పాత్రలో నటించినా, ఆ పాత్రలో పూర్తిగా లీనమైపోయేది ఆమె. నటన పట్ల ఆమె నిబద్ధత అద్వితీయం. 60 సంవత్సరాల పాటు నటించి, దాదాపు 500 సినిమాల్లో వైవిధ్య భరితమైన పాత్రలు పోషించిందంటే ఆమె నటన ఎంత విశిష్టమైందో మనం అర్థం చేసుకోవచ్చు. తెలుగు, తమిళ చిత్రాలతోపాటు హిందీలో 30 సినిమాల్లో నటించి ప్రేక్షకులను మెప్పించిన ఘనత అంజలీదేవిది.

నటిగా తన ప్రతిభను చాటిన అంజలీ దేవి నిర్మాతగా వలు విజయవంతమైన చిత్రాలు నిర్మించారు. నటిగా ఆవెు సాధించినదేమిటీ? కళారంగానికి మేలుచేసిందేమేటి? ఆమెకు లభించిన పురస్కారాలేమిటి? అనే ప్రశ్నలు వేసుకుంటే మనకు మిగిలే జవాబు సినిమారంగంలో కూడా ఆనాటి నుంచి ఈనాటి వరకు పితృస్వామ్యమే ప్రధానపాత్ర వహిస్తుంది. కళారంగంలో ఇంతటి మేధోశక్తి చూపినా భారత ప్రభుత్వం ఆ

నటనను గుర్తించి ఇచ్చే "పద్మ శ్రీ" 'పద్మ భూషణ్' లాంటి జాతీయ అవార్డులు ఆమెకు అందలేదు. ఆమెకే కాక ఎంత అద్భుతంగా నటించిన స్త్రీకైనా ఇంతవరకు ఆ గుర్తింపు ప్రభుత్వం ఇవ్వటం లేదంటే, వివక్ష ఎంత తీవ్రంగా ఉందో తెలుస్తోంది. రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చే రఘుపతి వెంకయ్య అవార్డ్ (2005), అక్కినేని జాతీయ అవార్డు మాత్రమే ఆమెకు లభించాయి. ఎన్.టి.రామారావుకు, నాగేశ్వర్‌రావుకు సమ ఉజ్జీగా అంతటి విశిష్టమైన పాత్రలను పోషించిన అంజలీ దేవికి ఎక్కువ అవార్డులు రాలేదంటే స్త్రీ కళాకారుల పరిస్థితి ఏమిటో అర్థం చేసుకోవచ్చు.

ఆమె తొలిగా అక్కినేని నాగేశ్వర్‌రావు, మేకప్ మాన్ గోపాల రావుతో కలిసి అశ్వనీ పిక్చర్స్ బేనరుపై, 'మాయలమారి' చిత్రాన్ని నిర్మించారు. ఆ తర్వాత ఆ బేనరు మూత పడడంతో

**తెలుగు చిత్రసీమలో అనేక దశాబ్దాలపాటు విలువైన భావాలను పంచుతూ, తిరుగులేని అభినేత్రిగా ప్రకాశించినట్టి అంజలీ దేవిని తెలుగుజాతి ఎన్నటికీ మరవలేదు. ఆమె జనవరిలో పరమపదించారు. ఆమె శరీరాన్ని వైద్య విద్యార్థుల పరిశోధనకు ఇవ్వమని కోరిన అంజలీదేవి కళారంగానికి, సమాజానికి స్ఫూర్తిప్రదాయనిగా నిలిచారు.**

1951లో అంజలీ పిక్చర్స్ సంస్థను ఏర్పాటు చేసి 'పరదేశి'లో శివాజీ గణేశన్‌తో కలిసి నటించి తమిళ చిత్ర రంగానికి పరిచయమయ్యారు. 'అనార్కలి' 'సువర్ణసుందరి', 'భక్త తుకారాం' 'మహాకవి క్షేత్రయ్య 'వంటి చిత్రాలు, సతీసుమతి' వంటి భక్తిరస ప్రధానమైన చిత్రాలలో ఆమె నటన అద్భుతం. మా తరానికి చెందిన వాళ్లం ఆనాటి కళాకారులను ఎన్నటికీ మరవలేం.

సమాజంలో రాజకీయ నాయకులకే కాదు, సాహిత్య పరులకేకాదు, కళాకారులుగా సామాజిక జీవితానికి ఎన్నో ఆదర్శాలను చూపిన కళాకారుల సేవ మరువరానిది. ఏ రంగంలోనైనా సేవ చేయవచ్చు. అనుకున్నది సాధించవచ్చు. జీవితాన్ని సార్థకం చేసుకోవచ్చునని నిరూపించారు అంజలీదేవి. వ్యాపార రంగంగా భావిస్తున్న సినీరంగమైన, సమాజాన్ని ఆహ్లాదాన్ని కల్గిస్తూ, తరాల తరబడి స్ఫూర్తిని కల్గిస్తున్న కళాకారుల సేవను మరువలేం. తెలుగు చిత్రసీమలో అనేక దశాబ్దాలపాటు విలువైన భావాలను పంచుతూ, తిరుగులేని అభినేత్రిగా ప్రకాశించినట్టి అంజలీ దేవిని తెలుగుజాతి ఎన్నటికీ మరవలేదు. ఆమె జనవరిలో పరమపదించారు. ఆమె శరీరాన్ని వైద్య విద్యార్థుల పరిశోధనకు ఇవ్వమని కోరిన అంజలీదేవి కళారంగానికి, సమాజానికి స్ఫూర్తిప్రదాయనిగా నిలిచారు. ●

## నాన్నలేని పుట్టిల్లు



ఆ ఇల్లు
నా పుట్టినిల్లు
బాల్యంలో కేరింతలు
యవ్వనంలో తుళ్ళింతలు
జ్ఞాపకాల సౌరభాలు గుబాళించినచోటు

ఆ నట్టింట్లో నాన్న
ఓ నిండైన విగ్రహం
పిల్లల మధ్య కీచులాటలు
పెద్దల మధ్య సయోధ్యలు
బంధుగణం సంప్రదింపులు
సమస్యలు సంతోషాలు
కలలు కలతలు
నాన్న నిలబడితేచాలు
అన్నీ పరిష్కారాలే
దూరాలన్నీ చేరువలే
భారాలన్నీ దూది పింజలే
అమ్మమాత్రం
అప్పుడూ ఇప్పుడూ ఓ శ్రోతగానే ఉండిపోయింది
వారసులంటూ కొడుకుల పక్షమే నిలిచిపోయింది
నాన్నలేని ఆ నట్టింట్లో
ఇపుడు నేను అతిథినయ్యాను
మర్యాదలన్నీ యాంత్రికమయ్యాయి
మనుష్యుల మధ్య కనపడని తెరలు
మనసుల మధ్య అడ్డంగా నిలిచాయి
అసలు మాటలు కూడా కరువయ్యాయి
యోగక్షేమాల ప్రశ్నలు లేవు
అత్తారింటి సంగతులు ఆరాలు తీసేవారు లేరు
ఆడపిల్లగా నా ఆస్తి హక్కు ఇక్కడా చిచ్చురేపింది
వాటా ఆడిగేస్తానేమోనని అన్నదమ్ములకు భయం
నగలైనా ఇవ్వమంటానేమోని అమ్మకి భయం

ఏళ్ళ తరబడి అత్తారింట్లో దాచుకున్న
నా ఉద్వేగాలనూ
ఏళ్ళ తరువాత మళ్ళీ చిన్న పిల్లగా
ఇల్లంతా కలియ తిరగాలన్న
నా ఆకాంక్షను
అణచిపెట్టే ఇనుప తెమ్మెరస్పర్శ !

ఏదో వెళ్ళకూడని చోటుకి వెళ్ళినట్టూ
తట్టకూడని తలుపు తట్టినట్లూ
నా మదిలో ఓ పరితాపం !
ఆ వాకిలి తెరచి వుంచినా
వారి మది తలుపులు మూసినట్లుంది!!

– దుర్గాప్రసన్న

సంఘర్షణ

# రెండు కత్తెరల కథ

- వేములపల్లి సత్యవతి

‘అమ్మమ్మ గారూ! ఈవాళ మీరు ‘రెండు కత్తెరల కథ’ చెప్పి తీరాల్సిందే. ఎప్పుడడిగినా మా చదువుల వంకతోను, మరేదో వంకతోనో దాట వేస్తున్నారు. నా స్నేహితురాలు శ్రావణి ఈరోజు కథ వినటానికి వస్తున్నది. పదకొండు గంటలకల్లా మీ పనులు, తులసిపూజ, భోజనం చేయటం పూర్తవుతాయి. మీకేమీ ఇబ్బంది వుండదుగా’ అని నారాయణమ్మను అడిగింది రవళి. ‘మీ చదువులు ముఖ్యమన్న వంకతో దాటవేశాను. కథలు వింటూ కూర్చుంటే పరీక్షల్లో నెగ్గాలిగా అమ్మాయి’ అనింది నారాయణమ్మ. 20ఏండ్ల దాన్ని ఇంకా అమ్మాయినేనా అమ్మమ్మ గారు అని నవ్వుతూ అడిగింది రవళి. ‘అమ్మాయివి కాక అమ్మవయ్యావా? మా కాలంలోనైతే 20ఏండ్లకు ఇద్దరు, ముగ్గురు బిడ్డలకు తల్లులయ్యేవారు. కాలం మారిందమ్మా’ అంది నారాయణమ్మ.

దాదాపు మూడు, నాలుగు వందల సంవత్సరాల క్రితం భర్త చనిపోతే అతనితోపాటు బ్రతికున్న అతని భార్యను కూడ పాడెలో వేసి కట్టిపడేసి కాల్చివేసేవారు. దానిని రాజారామ్మోహన్‌రాయ్ అనే సంస్కర్త బ్రిటిషువారి సహాయంతో చట్టం చేయించి ఆ దురాచారాన్ని మాన్పించాడు. అందువల్లే మా నాయినమ్మను, మిమ్ములను ఈ రోజు చూడగల్గుతున్నాను’ అని చెప్పింది. ఆపని చేయించింది ఏ కిరస్తానపోడో (క్రిస్టియన్లను అలా అనేవారు) అయి వుంటాడు. మనవాళ్ళు అలాంటి పనులు చేయరనింది. నారాయణమ్మ. నిజమే మామ్మగారు మనవాళ్ళకు అలాంటి మంచిపనులు చేయటం చేతకాదు. పైగా చేసిన వాళ్లను తిట్టిపోస్తారు. మీరన్నట్లు ఆపని చేయించింది కిరస్తానపాయినకాదు బెంగాల్ బ్రాహ్మణుడు. మన తెలుగువారిలో కూడ వీరేశలింగం పంతులుగారనే బ్రాహ్మణుడు రాజమండ్రిలో వుండేవారు. ఆ పంతులుగారు బాల్య వివాహాలు చేయవద్దని, ఆడపిల్లలను చదివించాలని, వితంతువులకు మరల పెండ్లిచేయాలని పనిచేశారు. వితంతువులకు పెండ్లిండ్లు కూడా చేశారు.

‘కాలం ఎప్పటిలాగే వుంది అమ్మమ్మ గారు. వేసవికాలం, వర్షాకాలం, చలికాలం ప్రకృతిలో మీ కాలంలాగానే ఇప్పుడూ జరిగిపోతూనేవున్నాయి. మారినవి మన సమాజంలోని మూఢాచారాలు, సాంప్రదాయాలు, మహిళల మీద వున్న కట్టుబాట్లు. అందువల్లనే మేము చదువుకోగల్గుతున్నాం. మీకో భయంకరమైన ఆచారాన్ని గురించి చెప్పనా? అనింది రవళి. చెప్పమని నారాయణమ్మ అంది. దాదాపు మూడు, నాలుగు వందల సంవత్సరాల క్రితం భర్త చనిపోతే అతనితోపాటు బ్రతికున్న అతని భార్యను కూడ పాడెలో వేసి కట్టిపడేసి కాల్చివేసేవారు. దానిని రాజారామ్మోహన్‌రాయ్ అనే సంస్కర్త బ్రిటిషువారి సహాయంతో చట్టం చేయించి ఆ దురాచారాన్ని మాన్పించాడు. అందువల్లే మా నాయినమ్మను, మిమ్ములను ఈ రోజు చూడగల్గుతున్నాను’ అని చెప్పింది. ఆపని చేయించింది ఏ కిరస్తానపోడో (క్రిస్టియన్లను అలా అనేవారు) అయి వుంటాడు. మనవాళ్ళు అలాంటి పనులు చేయరనింది. నారాయణమ్మ. నిజమే మామ్మగారు మనవాళ్ళకు అలాంటి మంచిపనులు చేయటం చేతకాదు. పైగా చేసిన వాళ్లను తిట్టిపోస్తారు. మీరన్నట్లు ఆపని చేయించింది కిరస్తానపాయినకాదు బెంగాల్ బ్రాహ్మణుడు. మన తెలుగువారిలో కూడ వీరేశలింగం పంతులుగారనే బ్రాహ్మణుడు రాజమండ్రిలో వుండేవారు. ఆ పంతులుగారు బాల్య వివాహాలు చేయవద్దని, ఆడపిల్లలను చదివించాలని, వితంతువులకు మరల పెండ్లిచేయాలని పనిచేశారు. వితంతువులకు పెండ్లిండ్లు కూడా చేశారు. అందుకాయన చెప్పలేనన్ని కష్టాలు పడ్డారని చెప్పింది. పంతులుగారి పేరు వినగానే నారాయణమ్మ ‘నేను చెప్పేరెండు కత్తెరల కథలో ఆ పంతులుగారి పేరు వస్తుంది. ఇవన్నీ మీరు చదువుకునేచోట చెబుతారా?’ అని అడిగింది.

‘చదువుకునే దగ్గర ఇలాంటివి చెప్పరు అమ్మమ్మగారు. మా అమ్మ మహిళా సంఘంలో పనిచేస్తుంది. పదిమంది ఆడవారు మా ఇంటిలో చేరేవారు. ఏవో మహిళల సమస్యలని చర్చించుకునేవారు.

**నేను తులసి కలిసి ఆటలాడుకునేవాళ్ళం. తొక్కుడుబిళ్ల, దొంగాట, ఎవరు ముందు పరుగెత్తుతారనేలాంటి ఆటలతోపాటు బొమ్మలపెండ్లి ఆటకూడ ఆడేవాళ్లం. అయిదేండ్లు నిండగానే తులసిని బడికి పంపారు. ఇంటికొచ్చిన తర్వాత తులసి పలక మీద బలపంతో అఆలు దిద్దుతుండేది. బడికి వెళ్ళి తులసిలాగ అఆలు దిద్దాలనిపించింది నాకు. అమ్మనడిగితే పొలంలో పనిచేసుకునే వాళ్లకు మనకెందుకు చదువన్నది. నేను అన్నం తినకుండా అలిగి ఏడ్వటం మొదలుపెట్టా. అమ్మ నాన్నతో చెప్పింది. నాన్న పోనీ పంపు మనమ్మాయయినా, తులసి అయినా పెండ్లి అయ్యేదాకానేగా చదివేదన్నాడు. నేను బడికి వెళ్ళి తులసితోపాటు చదువు మొదలుపెట్టా. బడినుంచి వచ్చిన తర్వాత ఇరువురం కలిసి ఆడుకోవటం, గన్నేరు, బొడ్డుమల్లె, చంద్రకాంతపూలు కోసుకొచ్చుకొని దారంతో గుచ్చి ఒకరి జడలో ఒకరం పెట్టుకునేవారం.**

వారంతా ఇంటింటికి తిరిగి ప్రచారం చేసేవారు. ఊరులో ఊరేగింపులు, సభలు పెట్టేవారు. ఆ సభల్లో మాట్లాడేవారు. మా అమ్మ నాకు మహిళా సంఘం చేసే పనులను గురించి, దురాచారాలను, సంఘ సంస్కర్తలను గురించి చెబుతూవుండేదంటూ వుండగానే శ్రావణి రావటం రావటంతోనే తన రాకకు ముందే కథ చెప్పించుకుంటున్నావని రవళితో పొట్లాటకు దిగింది. రవళి నవ్వుతూ లేదు తల్లీ! నీవు రాకముందు కథ చెప్పించుకుంటే అమ్మమ్మగారి ఇల్లు పీకిపాకం పెట్టవూ అంది. నారాయణమ్మెమో 'కథకాదు శ్రావణి ఏదో లోకాభి రామాయణం మాట్లాడుకుంటున్నాం. ఇక కథ మొదలు పెడతాను వినండి. కానీ ఇది నా చిన్నతనంలో మాఊరులో జరిగిన నిజమైన సంగతని చెప్పింది. పేర్లు మాత్రం నిజమయినవి కావని, అయినా వారంతా ఇప్పుడు లేరని చెప్పింది.

మా కాలంలో అన్ని కులాలలోను ఆడపిల్లలకు రజస్వలకాకముందే పెండ్లి చేసేవారు. మా ఊరులో మిగతా కులాలతోపాటు బ్రాహ్మణ కులంవారు వుండేవారు. మా ఇంటికి దగ్గరలో పురుషోత్తమయ్యగారి బ్రాహ్మణ కుటుంబం వుండేది. వారి పెద్దమ్మాయి తులసి, నేను ఒకే ఈడువాళ్ళం. మాది వ్యవసాయ కుటుంబం. మా అమ్మ అప్పుడప్పుడు బెండకాయలు, బీరకాయలు తులసి అమ్మగారికి ఇచ్చిరమ్మని పంపేది. ఆరోజుల్లో పురుషోత్తమయ్యగారికి చాలా మంది రైతు కుటుంబాలు ఏవో ఒకటి పంపుతుండేవారు. నేను తులసి కలిసి ఆటలాడుకునేవాళ్ళం. తొక్కుడుబిళ్ల, దొంగాట, ఎవరు ముందు పరుగెత్తుతారనేలాంటి ఆటలతోపాటు బొమ్మలపెండ్లి ఆటకూడ ఆడేవాళ్లం. అయిదేండ్లు నిండగానే తులసిని బడికి పంపారు. ఇంటికొచ్చిన తర్వాత తులసి పలక మీద బలపంతో అఆలు దిద్దుతుండేది. బడికి వెళ్ళి తులసిలాగ అఆలు దిద్దాలనిపించింది నాకు. అమ్మనడిగితే పొలంలో పనిచేసుకునే వాళ్లకు మనకెందుకు చదువన్నది. నేను అన్నం తినకుండా అలిగి ఏడ్వటం మొదలుపెట్టా. అమ్మ నాన్నతో చెప్పింది. నాన్న పోనీ పంపు మనమ్మాయయినా, తులసి అయినా పెండ్లి అయ్యేదాకానేగా చదివేదన్నాడు. నేను బడికి వెళ్ళి తులసితోపాటు చదువు మొదలుపెట్టా. బడినుంచి వచ్చిన తర్వాత ఇరువురం కలిసి ఆడుకోవటం, గన్నేరు, బొడ్డుమల్లె, చంద్రకాంతపూలు కోసుకొచ్చుకొని దారంతో గుచ్చి ఒకరి జడలో ఒకరం పెట్టుకునేవారం. బంతిపూలకాలంలో అరచేయంత రెండుపూలు తెచ్చుకుని పెట్టుకునేవారం. తులసి ఒంటి రంగు పసుపువచ్చ బంతిపూవులాగ వుండేది. పురుషోత్తమయ్యగారు మా ఊళ్లోనే కాక చుట్టు ప్రక్కల ఊళ్లకు వెళ్లి పెండ్లిండ్లు చేయించేవారు. చనిపోయిన వారికి శ్రాద్ధ కర్మలు చేయించేవారు. ఒకసారి పొరుగూరులో పెండ్లి చేయించటానికి వెళ్లారు. అక్కడే తెలిసిన వారెవరో మంచి సంబంధం ఉన్నదని చెపితే తులసి పెండ్లి నిశ్చయించుకొచ్చారు. ఇంటిలో చెప్పగానే తులసి అమ్మ శాంతమ్మగారు గోలపెట్టారు. ఇంటికొచ్చిన తర్వాత మంచిచెడులు చూడకుండ ఎవరో చెప్పిన మాటలు విని, నాతో ఒక్కమాట కూడా చెప్పకుండ ఎందుకు తొందర పడ్డారని గొడవ పడింది. మీ ఆడవాళ్లతో పెట్టుకుంటే తెగదు, ముడిపడదు. కాళ్ల దగ్గరకొచ్చిన బేరం కాశీకి పోయినా దొరకదు. పిల్లవాడు 11వ తరగతి పాసయ్యాడంట. తల్లి తండ్రిలేరు. పిల్లకు బంగారానికి, బట్టలకు వెయ్యి రూపాయలిస్తామన్నాడు పిల్లవాని అన్నగారు. మనం చిన్నమెత్తు బంగారం కొనలేము. తులసి అదృష్ట జాతకురాలు. వెయ్యి రూపాయలంటే మాటలా? మాట యిచ్చి వచ్చాను. పెండ్లి ఆగదన్నారు తులసి నాన్నగారు. అప్పటికి మాకిరువురకు పదేండ్లు నిండినవి. నాల్గవ తరగతి వరకు చదువుకున్నాం. తులసి పెండ్లి జరిగిపోయింది. ఒక సంవత్సరం తర్వాత నా పెండ్లి అయ్యింది. వెయ్యి రూపాయలిస్తామన్నవారు వంద రూపాయలు కూడ ఇవ్వలేదు. నూరు అబద్ధాలాడైన ఒక పెండ్లి చేయాలనే రోజులవి. పైగా పురుషోత్తమయ్యగారి అల్లుని కూడా సాకవలసి వచ్చింది. పెండ్లి తర్వాత అన్న-తమ్ముని బాధ్యతను వదిలివేసాడు. పురుషోత్తమయ్యగారే సెకండరీగ్రేడ్ ట్రైనింగ్ చేయించి పలుకుబడి వున్నవారి రికమెండేషన్‌తో అల్లునికి పంతులు ఉద్యోగం ఇప్పించారు. అప్పటికి తులసి రజస్వలయి ఉంది. భర్తతోపాటు అతనికి ఉద్యోగం వచ్చిన ఊరులో కాపురం మొదలుపెట్టింది. మూలిగే నక్కమీద తాటికాయ పడినట్లు ఏ రోగము లేకుండానే పురుషోత్తమయ్యగారు చనిపోయారు. తులసికి ఒక చెల్లెలు, ఇద్దరు తమ్ముళ్లు. వాళ్లనెలా

పెంచి పెద్దచేయాలన్న వేదనతో శాంతమ్మగారితోపాటు బంధుజనులంతా తల్లడిల్లిపోయారు.

పురుషోత్తమయ్యగారు చనిపోయిన రెండు సంవత్సరాలకు తులసి భర్తకూడ పరలోకానికి ప్రయాణమయ్యాడు. విషజ్వరం అని, చేదగ్గని (క్షయ) అన్నారు. ఆరోజుల్లో సరైన వైద్య సౌకర్యాలు వుండేవి కావు. పైగా తులసి భర్తను ఆదుకోవటానికి ఇటు పుట్టింటివారిలో ఎవరూలేరు. పెండ్లి తర్వాత తులసి బావగారి జాడ, జవాబులేదు. ఆ వూరిలోనే దహనం చేసి తులసిని పుట్టింటికి తీసుకొచ్చారు. నేను అప్పుడు మా అమ్మగారి ఇంటిలోవున్నా. తులసి వచ్చిన రోజునే వెళ్లి చూడాలనిపించింది. అదేమాట అమ్మతో అన్నా. ఇప్పుడు వెళ్లకూడదు. మైల. వారికి మడని ఏవో ఆచారాలు వుంటాయి. మనవి వేరు. అందులో నీవు కడుపుతో వున్నావు. 15,20 రోజులవరకు వెళ్లకూడదనింది. ఒకరోజు ప్రొద్దుట పూట పెందలాడే పొలం వెళ్లింది అమ్మ, చాకలి పుల్లి బట్టలు తీసుకెళ్లటానికి వచ్చింది. దానికి ఒక శేరు బియ్యం ఇచ్చి తులసిని ఈరోజు చీకటి పడిన తర్వాత ఆరుబయట పాడుబడిన బావి (నుయ్యి) దగ్గరకు చెంబు తీసుకుని రమ్మన్నానని చెప్పాలని పుల్లికి చెప్పా. అందుకే శేరు బియ్యం ఇచ్చా. ఆయమ్మ గదిలోనుంచి బయటకు రావటమేలేదు. ఏదో విధంగా చెబుతానని, ఏ సంగతి సాయంకాలం బట్టలు తీసుకొచ్చినప్పుడు సైగతో తెలియజేస్తానని చెప్పింది. అన్నట్టుగానే వస్తానన్నదని సైగద్వారా తెలిపింది. నేను కూడా చెంబుతోనీళ్ళు తీసుకొని వెళ్ళా. ఆ రోజుల్లో మరుగుదొడ్లు వుండేవికావు. పురుషులు వేరుగా, మహిళలు వేరుగా బాహిర్భూమికి వెళ్లేవారు. మేము కలుసుకునే చోటుకు ఎవరూ రారు. ఇరువురము ఒకరినొకరం కావలించుకుని కావలసినంత ఏడ్చుకున్నాం. తులసికి పెద్దకర్మనాడు గుండు చేస్తారు. అది తులసికి ఏమాత్రమూ ఇష్టం లేదు. దానికన్న చావటం మేలనింది. తల్లిని కావులించుకుని గుండు చేయించవద్దని ఏడ్చిందట. పూర్వం నుంచి వస్తున్న ఆచారం. కాదంటే కులం నుంచి వెలివేస్తారు. మన తలరాతలిలావున్నాయని తులసిని పట్టుకుని తల్లికూడ ఏడ్చిందని తులసి చెప్పింది. పెద్దకర్మ రోజు రానే వచ్చింది. తులసి బామ్మగారు, అమ్మమ్మగారు రెండుపాత కత్తెరలు సంపాదించి, వాటిని సాన పట్టించి తయారుగా వుంచారు. చెరో కత్తెర పట్టుకుని ఇంటి వెనుక పెరటిలో కూర్చున్నారు. మగవారు బయట కర్మకాండ పూర్తిచేసుకుని వచ్చేలోగా తులసికి గుండుచేయాలని తులసిని బామ్మ, అమ్మమ్మ రమ్మని పిలవసాగారు. **ఎన్నిసార్లు పిలిచినా జవాబు రాలేదు.** పాపం! గుండు చేస్తారన్న బాధకు రావటంలేదనుకుని ఇరువురు తీసుకురావటానికి తులసి గదికి వెళ్ళారు. గదిలో కనిపించలేదు. శాంతమ్మనడిగారు. నా పనిలో నేనున్నా దాని గదివైపు వెళ్లలేదనింది. ఇంటా-బయటా అంతా వెతికారు. ఎక్కడా కనిపించలా. ఇంకేముంది? కొంపమునిగింది. ఎవడితోనో లేచిపోయింది. కుటుంబ పరువు-ప్రతిష్టలు గంగలో కలిపింది. ఎందులోనైనా దూకి చస్తే పరువు నిలిచేది. ఇలాంటి పాపిష్టి బుద్ధులుండబట్టే బ్రహ్మదేవుడు ఇలాంటి రాతరాసాడని తిట్టి పోశారు. ఇలాంటి కూతుర్ని కన్నందుకు పాపం! శాంతమ్మను అనరాని మాటలన్నారు.

పురుషోత్తమయ్యగారి తమ్ముడు సీతారామయ్యగారు ఊరులోవున్న ప్రభుత్వ పాఠశాలలో పంతులుగా పనిచేస్తున్నారు. అదే బడిలో రాజమండ్రికి చెందిన పంతులు సుబ్బరామయ్యగారు పనిచేస్తున్నారు. ఆయన సీతరామయ్యగారికి రాజమండ్రిలోని వీరేశలింగం గారిని గురించి, ఆయన కార్యక్రమాలను గురించి చెపుతూ వుండేవారు. ఇద్దరు మంచి మిత్రులయ్యారు. తులసిని ఏలాగైనా సుబ్బరామయ్యగారి సాయంతో కాపాడాలన్న ఆలోచన వచ్చింది. దానికి తగిన ఏర్పాట్లు చేసి తెల్లవారి తులసికి గుండు చేయకముందే ఆరోజు అర్ధరాత్రి ఇంటినుంచి రాజమండ్రి పంతులుగారి పాఠశాలకు చేరవేశారు. ఎవరికి అనుమానం కల్గకుండ సీతరామయ్యగారు, సుబ్బరామయ్యగారు వూరువదిలి వెళ్లకుండ తులసిని దాటవేసే ప్లాన్ వేసుకున్నారు. ఈ మాటలు నారాయణమ్మ గారు చెప్పగానే 'తులసి వెళ్లినపుడు వీరేశలింగంగారు బతికేవున్నారా' అని రవళి, శ్రావణి అడిగారు. అ సంగతి నాకు తెలియదమ్మాయిలు అని నారాయణమ్మగారు చెప్పారు. ఆ తర్వాత నాకు ఆడపిల్ల పుట్టింది. మూడో నెలలో అత్తవారింటివారు వచ్చి తీసుకెళ్లారని చెప్పింది. ఆడపిల్లను కన్నావని మీ అత్తింటివారు మిమ్ములను సాధించలేదా అని రవళి, శ్రావణి అడిగారు. ఆ కాలంలో తొలికాన్పులో ఆడపిల్లపుడితే లక్ష్మీదేవి పుట్టిందనేవారు. అంతేకాదు కొంతమందికి అందరూ ఆడపిల్లలే పుట్టేవారు. అయినా ఏలాంటి వేధింపులు లేకుండా పెంచేవారు అనింది. అయితే అమ్మమ్మగారూ! తులసి సంగతి ఆమె తల్లికిగాని, మీకుగాని తర్వాత కాలంలో తెలియలేదా? అని అడిగారు. తెలియకేమి? ఏడవ తరగతి పాసవగానే సెలవుల్లో సీతారామయ్యగారు తులసిని తీసుకొచ్చారు. ఎలిమెంటరి ట్రైనింగ్ చదివించి పూర్తవగానే పంతులమ్మ ఉ

**తులసికి పెద్దకర్మనాడు గుండు చేస్తారు. అది తులసికి ఏమాత్రమూ ఇష్టం లేదు. దానికన్న చావటం మేలనింది. తల్లిని కావులించుకుని గుండు చేయించవద్దని ఏడ్చిందట. పూర్వం నుంచి వస్తున్న ఆచారం. కాదంటే కులం నుంచి వెలివేస్తారు. మన తలరాతలిలావున్నాయని తులసిని పట్టుకుని తల్లికూడ ఏడ్చిందని తులసి చెప్పింది. పెద్దకర్మ రోజు రానే వచ్చింది. తులసి బామ్మగారు, అమ్మమ్మగారు రెండుపాత కత్తెరలు సంపాదించి, వాటిని సాన పట్టించి తయారుగా వుంచారు. చెరో కత్తెర పట్టుకుని ఇంటి వెనుక పెరటిలో కూర్చున్నారు. మగవారు బయట కర్మకాండ పూర్తిచేసుకుని వచ్చేలోగా తులసికి గుండుచేయాలని తులసిని బామ్మ, అమ్మమ్మ రమ్మని పిలవసాగారు.**

**చెల్లిని తనతోపాటు తీసుకెళ్లి హైస్కూల్ వరకు చదివిస్తానని, నాలాగా బాల్యవివాహం చేయవద్దని చెప్పి చెల్లిని తీసుకొని వెళ్లి ఉద్యోగంలో చేరింది. వినయంగా, కలుపుకోలుతనంగా అందరితో కలిసిపోయేదట. శ్రద్ధగా పాఠాలు చెప్పి ఉత్తమ ఉపాధ్యాయురాలని పేరు తెచ్చుకుంది. తాను అన్నట్లుగానే చెల్లెల్ని సెకండరీ గ్రేడ్ ట్రైనింగ్ పూర్తి చేయించి పంతులమ్మ ఉద్యోగం వచ్చిన తర్వాత సెకండరీగ్రేడ్ పంతులుగారితో చెల్లెలి వివాహం చేసింది. తల్లికి, తమ్ముళ్లకు చేతనైన చేయూతనిచ్చింది.**

ద్యోగం ఇప్పించారు. నేను శుభకార్యాలకు, పండుగలకు పుట్టింటికి వెళ్లివస్తుండేదాన్ని. తులసి చదువుకున్న సంగతి, పంతులమ్మ అయిన సంగతులు తెలిశాయి.

ఒకసారి నేను మా పుట్టింట్లో వుండగా తులసి సెలవులకు అమ్మగారి ఇంటికి వచ్చింది. తులసిని చూడగానే నా చూపు తులసి తలపై పడింది. గుండు చేయిస్తారని ఆ రోజుల్లో తలపుకొచ్చినప్పుడు గునపంతో గుండెల్లో గుచ్చినంత బాధ కలిగేది. మరి తులసి ఎంత నరకమనుభవించిందో. జడ లేదుగాని చక్కగా దువ్వుకుని ముడిచుట్టుకుని వుంది. చూడగానే లోపలనుంచి పరుగెత్తివచ్చి కావలించుకుని చేతులు పట్టుకొని ఏకాంత ప్రదేశానికి తీసికెళ్లింది. తననేవిధంగా బాబాయి, సుబ్బరామయ్యగారు తప్పించిన పథకాన్ని గురించి, పంతులుగారి స్కూల్లో తనలాంటి వారేకాక మామూలు పిల్లలు, మహిళల చదువును గురించి బోలెడు సంగతులు చెప్పింది. గవర్నమెంట్ పాఠశాలలో పంతులమ్మగా నియమించిన అర్డరుకాగితం చదువుకొని నేను పొందిన ఆనందం పంచుకోవటానికి నీవు లేకపోయావన్న విచారం కలిగింది. సంతోషంతో ఈ సంగతి ముందు బాబాయిగార్కి చెప్పి నమస్కరించి అమ్మతో తర్వాత చెప్పాను. సంతోషంతోపాటు అమ్మ నన్ను ఉద్యోగం వచ్చిన ఊరుకు ఒంటరిగా పంపటానికి భయపడిందని చెప్పింది. మిసమిసలాడుతున్న వయసులో ఏమి తప్పువని చేస్తానోనని, ఎక్కడ కాలుజారుతానోనని భయపడిందని చెప్పింది. ఈ లాంటివి జరిగితే ఇంకా ఎటువంటి అపవాదులు వినవలసి వస్తుందోనని చెప్పి తులసిని పట్టుకుని ఏడ్చిందట. అలాంటి తప్పు పనులేమి చేయనని తల్లికి భరోసాయిచ్చి, చెల్లిని తనతోపాటు తీసుకెళ్లి హైస్కూల్ వరకు చదివిస్తానని, నాలాగా బాల్యవివాహం చేయవద్దని చెప్పి చెల్లిని తీసుకొని వెళ్లి ఉద్యోగంలో చేరింది. వినయంగా, కలుపుకోలుతనంగా అందరితో కలిసిపోయేదట. శ్రద్ధగా పాఠాలు చెప్పి ఉత్తమ ఉపాధ్యాయురాలని పేరు తెచ్చుకుంది. తాను అన్నట్లుగానే చెల్లెల్ని సెకండరీ గ్రేడ్ ట్రైనింగ్ పూర్తి చేయించి పంతులమ్మ ఉద్యోగం వచ్చిన తర్వాత సెకండరీగ్రేడ్ పంతులుగారితో చెల్లెలి వివాహం చేసింది. తల్లికి, తమ్ముళ్లకు చేతనైన చేయూతనిచ్చింది. ఆ మాటలు వింటే నా మనసు సంతోషంతో వుప్పొంగింది. ఇదే రెండు కత్తెరల కథ. మూర్తయిందనింది నారాయణమ్మ. మిమ్ములను కత్తెరకథ చెప్పమని చాలా సార్లు విసిగించాం. కత్తెరలంటే బట్టలు కుట్టేదేదో కథ అనుకున్నాం. మీ కాలంనాటి సమాజంలోని సంగతులు చెప్పారు. ఇకవెళతామని లేచాం. ఉండుండు అని లోపలకెళ్లి రెండు అరిసెలు, రెండు చక్కిడాలు తెచ్చి తిని వెళ్ళాల్సిందే ఇంతసేపు కూర్చోపెట్టి వూరికే ఎలా పంపిస్తాననింది. అవి తిని అరిసెల లాంటి మా ఇరువురి తియ్యని స్నేహానికి, చక్కిడాలవంటి కఠినమైన కరుడుగట్టిన గట్టి ఆచారాలను తెల్పారు. అందుకు మీకు మా వందనాలు. ఇక వెళతామని చెప్పి రవళి, శ్రావణి వెళ్లిపోయారు. తనకాలం నాటి ఆడపిల్లలకు, నేటి రవళి, శ్రావణిలాంటి ఆడపిల్లలకు పొంతనే లేదు. భూమికి, ఆకాశానికి వున్నంత తేడా కనిపిస్తున్నదని అనుకున్నది నారాయణమ్మ.

9వ పేజీ తరువాయి

కుటుంబాలపై అధిక ఆర్థిక భారం పడుతుంది. ART పరిశ్రమగా చెప్పబడే ఈ వ్యాపారంలో అండదానం చేసే మహిళలకు కానీ గర్భాశయాన్ని అద్దెకిచ్చే తల్లికి కానీ పెద్ద ప్రయోజనమేమి ఉండడం లేదు. కొన్ని రిపోర్టులను పరిశీలిస్తే ఈ ఆసుపత్రులు ఒక మహిళ నుండి ఒక ఋతుక్రమంలో 25నుండి 30 అండాలను సేకరిస్తారు. వారికి 20,000 నుండి 25,000 వేల వరకూ చెల్లిస్తారు. వినియోగదారుల వద్దనుండి ఒకసారి ఒక అండంతో చేసే చికిత్సకే 50,000 రూ॥లను వసూలు చేస్తారు. ఒకసారి అండ సేకరణ చేసే క్రమంలోనే ఆసుపత్రులకు 20 అండాల వరకూ వచ్చిన రేటు లాభంగా మిగులుతుంది. ఇది ఒక అంచనా మాత్రమే ఇంకా పూర్తి వివరాలు తెలియాల్సివుంది. ఈ కొద్దిపాటి లెక్కలతోనే ఈ వ్యాపారం ఎంత లాభదాయకంగా వుందో మనం తెలుసుకోవచ్చు. అందుకే ప్రైవేటు రంగం ఈ వ్యాపారాన్ని నియంత్రించేందుకు ఒప్పుకోవడం లేదనేది స్పష్టంగా తెలుస్తుంది.

యుమాషెర్ప మరణంతో మహిళా ఉద్యమాలు, ప్రజాతంత్ర ఉద్యమాలు ఈ అంశంపై కదలాల్సిన ఆవశ్యకత తెలుస్తుంది. ప్రైవేటు రంగంలోని ఈ IVF ఆసుపత్రులు సాగించే దుర్మార్గాలను వెలుగులోకి తేవాల్సివుంది. ఈ రంగంలో చట్టపరమైన రక్షణ కోసం మనం పోరాడాల్సి వుంది. అంతేకాక వ్యాపార వర్గాలు సాగించే దోపిడీ వివిధ కోణాలపై మనం దృష్టి సారించాలి. అప్పుడే మనదేశంలో మహిళలపై జరుగుతున్న ఈ దోపిడిని మనం అడ్డుకోగలుగుతాము. నూతన సరళీకరణ విధానాల్లో అభివృద్ధికి ఉదాహరణగా చెప్పబడుతున్న ఇటువంటి విధానాలను అడ్డుకోవాలి. మానవ శరీర భాగాలను కూడా వ్యాపారమయం చేస్తూ కొద్ది మంది లాభాల కోసం మానవ జీవితాలను దోచుకొంటున్న ఈ విధానాలను మనం త్రిప్పి కొట్టాలి.

అనువాదం - కె. నాగలక్ష్మి

అభినందన



# ఎవరెస్టు పులకించిన వేళ

–ఓల్గా, వసంత కన్నభిరాన్

ఇంత మండుతున్న ఎండల్లోకి హిమాలయాల శీతల పవనాలు తెచ్చారు పూర్ణా, ఆనంద్‌లు. గిరిజన తండాలోంచి, దళితవాడ నుంచీ భారతదేశపు అత్యున్నత శిఖరం అధిరోహించారు. వార్తా పత్రికల్లో అది చిన్న వార్తగానే వచ్చింది. దేశంలోని రాజకీయ అధికారమూ, విభజన సమయంలో నాయకుల హడావుడీ మధ్య ఆ చిన్నపిల్లలు దేశ పతాక ఆవిష్కరణను ఎవరెస్టు శిఖరం మీద చేశారు. పతాక ఆవిష్కరణే అయితే అది చాలా మందే చేశారు. ఎవరెస్టు శిఖరాగ్రం చేరిన ప్రతి భారతీయ వ్యక్తీ జాతీయ జండాను అక్కడ ఎగరవేయటం సాధారణమే. కానీ ఈసారి పూర్ణా, ఆనంద్‌లు అక్కడికి అంబేద్కర్‌నీ, ఎస్.ఆర్.శంకరన్ గారినీ తమతోపాటు తీసుకెళ్లారు. వారి చిత్రపటాలనక్కడ ఉంచడం ద్వారా హిమాలయోన్నతమైన వారి ఆదర్శాలను, ఆచరణను రకరకాల స్వార్థ పూరిత రాజకీయాలలో మగ్గిపోతున్న భారత ప్రజలకు ఒక సుందర దృశ్యాన్ని గుర్తుచేశారు. మానవీయ విలువల పాఠాలు నేర్పిన మహానుభావులను వర్తమానంలో తప్పనిసరిగా గుర్తుంచుకోవాలని అంతెత్తున నిలబడి ఎలుగెత్తి అరిచి చెప్పినట్లుగా ఉంది పూర్ణా, ఆనంద్‌ల చర్య.

ఇది కేవలం వారిద్దరిపట్లా తమ గౌరవాన్ని ప్రకటించే చర్యగానే పూర్ణా, ఆనంద్‌లు భావించి ఉండవచ్చు. అంబేద్కర్, ఎస్.ఆర్ శంకరన్‌లకు కృతజ్ఞతలు చెప్పటంగానే అనుకుని ఉండవచ్చు. కానీ వారిద్దరూ, వారి గురువుగారు, ఆంధ్రప్రదేశ్ రెసిడెన్షియల్ అసోసియేషన్ సెక్రెటరి అయిన ప్రవీణ్‌కుమార్‌గారూ చేసిన పని ఒక రాజకీయమైన చర్యగానే మాకు కనిపిస్తున్నది. అంబేద్కర్ రాజ్యాంగ నిర్మాత. దళితుల సమానత్వం కోసం, వారి రాజకీయ ఆర్థిక, సాంఘిక అభివృద్ధి కోసం జీవితాంతం విరామమెరుగని పరిశ్రమ చేసిన మేధావి. ఎస్.ఆర్.శంకరన్‌గారు రాజ్యాంగంలో దళితులకు ఇచ్చిన హక్కులను ఆచరణలోకి తీసుకురావటానికి నిరంతరం కృషి చేసిన ప్రభుత్వాధికారి. నిజానికి ప్రభుత్వాధికారి అనేమాట వినగానే అధికార దర్పంతో, ఆడంబరాలతో, అట్టహాసాలతో ప్రజలమీద అధికారం చలాయించే, ప్రజలను పీడించే, సహజ వనరులన్నీ రాజకీయ నాయకులకు దోచి పెట్టే అధికారులు గుర్తొస్తున్న కాలంలో శంకరన్ గారికి 'అధికారి' అనే పదం అసలు నప్పదు. ఆయన అసలైన అర్థంలో ప్రజా సేవకుడు. అలాంటి వారిద్దరినీ పూర్ణా, ఆనంద్‌లు ఒక్కసారిగా భారతదేశంలోని ప్రజలందరి దృష్టికీ తీసుకొచ్చారు. భారతదేశాన్ని "సర్వసత్తాక సామ్యవాద లౌకిక ప్రజాస్వామ్య గణతంత్రంగా" ప్రకటించిన రాజ్యాంగ నిర్మాణానికి సారధ్యం వహించిన అంబేద్కర్ ఇవాళ్టి అవసరం. దేశంలో 69 శాతం మంది ప్రజలు ఇవాళ అసలే కునారిల్లుతున్న లౌకికవాదం తెగనరకబడుతుందేమోనని భయపడుతున్న, సందేహపడుతున్న సందర్భం ఇది. ఈ సందర్భంలో అంబేద్కర్‌ని ఎవరెస్టు మీద ఆవిష్కరించి, రాజ్యాంగ స్ఫూర్తిని గమనించమని దేశాధినేతలనూ, దేశ ప్రజలనూ హెచ్చరించారు పూర్ణ, ఆనంద్‌లు. 'సర్వసత్తాకత'ను అగ్రరాజ్యాల ముందు మోకరిల్ల చేసిన నాయకులను చూసి చూసి విసుగెత్తి ఉన్నాం. ఇప్పుడు ఇంకెంత మాత్రమూ మన దేశ సార్వభౌమత్వాన్ని వదులుకోవద్దని గుర్తుచేస్తున్నారు పూర్ణా, ఆనంద్‌లు. "సామాజికంగా, మరియు

**అంబేద్కర్ రాజ్యాంగ నిర్మాత. దళితుల సమానత్వం కోసం, వారి రాజకీయ ఆర్థిక, సాంఘిక అభివృద్ధి కోసం జీవితాంతం విరామమెరుగని పరిశ్రమ చేసిన మేధావి. ఎస్.ఆర్.శంకరన్‌గారు రాజ్యాంగంలో దళితులకు ఇచ్చిన హక్కులను ఆచరణలోకి తీసుకురావటానికి నిరంతరం కృషి చేసిన ప్రభుత్వాధికారి. నిజానికి ప్రభుత్వాధికారి అనేమాట వినగానే అధికార దర్పంతో, ఆడంబరాలతో, అట్టహాసాలతో ప్రజలమీద అధికారం చలాయించే, ప్రజలను పీడించే, సహజ వనరులన్నీ రాజకీయ నాయకులకు దోచి పెట్టే అధికారులు గుర్తొస్తున్న కాలంలో శంకరన్ గారికి 'అధికారి' అనే పదం అసలు నప్పదు. ఆయన అసలైన అర్థంలో ప్రజా సేవకుడు.**

**అంటరానితనాన్ని నిషేదించిన రాజ్యాంగ శాసనాన్ని గుర్తు చేస్తున్నారు వాళ్ళిద్దరూ. ఏ సమయంలో? అంటరానితనాన్ని పరోక్షంగా ప్రోత్సహిస్తూ, వెలిని, వెట్టి చాకిరిని రకరకాల రూపాల్లో ప్రవేశపెడుతూ, ఖాప్ పంచాయితీలను ప్రోత్సహిస్తూ, వాటి అధికారాలను కాపాడుతూ పాలకులు పరోక్షంగా రాజ్యాంగానికి తూట్లు పొడుస్తున్న సమయంలో పూర్ణా, ఆనంద్‌లు చేసిన ఈ చిన్న పని ఒక పెద్ద ముందడుగు.**

విద్యాపరంగా వెనుకబడినవారు లేదా షెడ్యూల్డు కులములు, మరియు షెడ్యూల్డు తెగలవారి అభ్యున్నతి కోసం ప్రత్యేకమైన నిబంధనలను ప్రభుత్వము జారీ చేయవచ్చును" అని రాజ్యాంగంలో, ఆర్టికల్ 15లో నాలుగవ నిబంధనను ప్రవేశపెట్టిన రాజ్యాంగ రథ సారథిని గుర్తు తెచ్చారు. ఆ రకంగా రాజ్యాంగాన్ని గుర్తు తెచ్చారు. ఎప్పుడు? ఎలాంటి సమయంలో? రిజర్వేషన్లకు వ్యతిరేకంగా 90వ దశాబ్దంలో పెద్ద ఎత్తున ఆందోళన చేసిన రాజకీయపార్టీ అత్యధిక మెజారిటీతో భారత దేశాన్ని పరిపాలించబోతున్న సమయంలో క్రీమిలేయర్ వాదనతో రాజ్యాంగ హక్కులను పక్కదారి పట్టించాలని చూసే మేధావులు రాబోయే సంవత్సరాలలో చేయబోయే వాదనలను సవాలు చేయాల్సిన అవసరాన్ని, సవాలు చేసే ధైర్యాన్నీ ఎవరెస్టు శిఖరం మీద ఎగరవేశారు పూర్ణా, ఆనంద్‌లు. అంటరానితనాన్ని నిషేదించిన రాజ్యాంగ శాసనాన్ని గుర్తు చేస్తున్నారు వాళ్ళిద్దరూ. ఏ సమయంలో? అంటరానితనాన్ని పరోక్షంగా ప్రోత్సహిస్తూ, వెలిని, వెట్టి చాకిరిని రకరకాల రూపాల్లో ప్రవేశపెడుతూ, ఖాప్ పంచాయితీలను ప్రోత్సహిస్తూ, వాటి అధికారాలను కాపాడుతూ పాలకులు పరోక్షంగా రాజ్యాంగానికి తూట్లు పొడుస్తున్న సమయంలో పూర్ణా, ఆనంద్‌లు చేసిన ఈ చిన్న పని ఒక పెద్ద ముందడుగు.

మన రాజ్యాంగంలో ప్రజల సమాన అభివృద్ధికి కావలసిన శాసనాలన్నీ ఉన్నాయి. కానీ వాటిని అమలు చేయటం దగ్గరే అసలు సమస్య. రాజ్యాంగం ఉంది గానీ, రాజ్యాంగ నైతికత లోపించిన దేశం మనది. అలాంటి దేశంలో దళితులకు రాజ్యాంగం ఇచ్చిన హక్కుల గురించి ఎవరు చెప్తారు? రాజ్యాంగాన్ని వ్యాఖ్యానించి వారి సమానత్వంకోసం, అభివృద్ధికోసం ప్రభుత్వంవైపు నుంచి ఉత్తర్వులు జారీ చేసి, కొత్త ప్రభుత్వాదేశాలను రూపొందించి, అమలు చేయాలనే ఆత్రుత ఎవరికి ఉంటుంది? ఎస్.ఆర్. శంకరన్ గారు ఆ విషయంలో తీసుకున్న శ్రద్ధ, చొరవ, చూపిన అంకితభావం మళ్ళీ మళ్ళీ గుర్తు చేసుకోవాల్సినవి. ఒక్క వ్యక్తి తనకున్న కొద్ది అధికారంతో, అనేక పరిమితులతో ఎంతపని చేయగలడో శంకరన్ గారి జీవితం మనకు చెబుతుంది. ఆయన దళితుల కోసం తన జీవితకాలంలో చేసిన పని సామాన్యమైనది కాదు. రాజ్యాంగంలోని ఆర్టికల్ 17ను దృష్టిలోకి తీసుకుని-(ఆర్టికల్17 అంటరానితనాన్ని నిషేధిస్తుంది) దానిని ఆచరణలోకి తీసుకురావటానికి సాంఘిక సంక్షేమ శాఖ అధికారిగా పనిచేస్తూ 136 ప్రభుత్వ ఉత్తర్వును (జి.వో) శంకరన్ గారు జారీ చేశారు. ఉన్న జీ.వోలను అమలుచేయించటానికి శ్రద్ధ పెట్టని ఆఫీసర్లు, కొత్త జి.వొలు రాజకీయ నాయకుల వ్యక్తిగత ప్రయోజనాల కోసం తయారుచేయటం మాత్రమే తెలిసిన అధికారులూ పెరిగిపోతున్న ప్రస్తుత కాలంలో శంకరన్‌గారిని గుర్తుకు తీసుకురావటమంటే అవినీతి అధికారులను ఎవరెస్టు ఎక్కి మరీ హెచ్చరించటమే. అతి నిరాడంబరంగా జీవిస్తూ, తన కర్తవ్యాన్ని నిర్వహించటం కోసమే బ్రతికి వెళ్ళిపోయిన మహానుభావుడు శంకరన్‌గారు. అతిశయాలకూ, ఆర్భాటాలకూ దూరంగా, ప్రజలకు ఎప్పుడూ అందుబాటులో ఉండే అధికారులు కరువవుతున్న సమయంలో పూర్ణా, ఆనంద్‌లు శంకరన్‌గారి జీవితాన్ని అత్యున్నత ఉదాహరణగా ఇంతెత్తున నిలబెట్టారు.

చాలామంది ఎవరెస్టు అధిరోహణను ప్రకృతిని మనిషి జయించటంగా భావిస్తారు. కానీ ఈ పిల్లలిద్దరూ చేసిన ఈ పనితో ఎవరెస్టు ఎక్కటమంటే ఉన్న అర్థం మారిపోయింది. అది ప్రకృతిని జయించటం కాదు, ప్రకృతితో సహజీవనం చేయటమనే అర్థం వచ్చింది. మన రాజ్యాంగంలో పర్యావరణానికి సంబంధించిన ఆర్టికల్ 48 ఎ, ఆర్టికల్ 51ఎ, చివరికి జీవించే హక్కుని చెప్పే ఆర్టికల్ 21 కూడా పర్యావరణంతో ముడిపడినవే. ఇవాళ ప్రపంచం 'క్లయిమేట్ ఛేంజ్' అనే మాటతో ఉలిక్కిపడుతున్న సందర్భంలో ఉన్నప్పుడు పర్యావరణానికీ, జీవించే హక్కుకీ ఒక అనుబంధాన్ని కల్పించే అవకాశాన్నిచ్చిన మన రాజ్యాంగ నిర్మాత, భవిష్యత్తులో పరిరక్షించుకోవాల్సిన స్థితిలోపడే ఎవరెస్టు శిఖరం మీది నుంచి జాతిని హెచ్చరించినట్లు లేదూ? ఎవరెస్టు మీది నుంచి దిశా నిర్దేశం చేస్తున్నట్లు లేదూ? ఎన్నెన్నో వర్తమాన, భవిష్యత్ విషయాలనూ, కీలక రాజకీయాలనూ, రాజ్యాంగ స్ఫూర్తినీ, ఆచరణనూ, అధికారాలనూ, మరీ ముఖ్యంగా లౌకికతనూ, దళితుల, గిరిజనుల అభివృద్ధినీ మనందరికీ ఒకసారి గుర్తు తెచ్చినందుకు పూర్ణా, ఆనంద్‌లను అభినందిద్దాం. వారి సాహసం, శక్తీ కేవలం శారీరకమైనవే కాదు, చైతన్యంతో వెల్లివిరిస్తున్నవి... ఆ చైతన్యం దేశమంతటికీ అవసరమైనది. ఆవాహన చేసుకోవలసినది.

●

సీరియల్

# మరోఅమ్మ (మేరీజోన్స్ ఆత్మకథ)

## తొలి దినాలు




*(గత సంచిక తరువాయి)*

నేను 1830లో పుట్టాను. నా జన్మస్థలం ఐర్లాండ్‌లోని కార్క్‌నగరం. నా ప్రజలు పేదవారు. తరతరాలుగా ఐర్లాండ్ స్వాతంత్ర్యం కోసం పోరాడారు. ఈ పోరాటంలో అనేక మంది ప్రాణత్యాగం చేశారు. మా నాన్నగారు రిచర్డ్ హారిస్ 1835లో అమెరికాకు వలస వచ్చారు. అమెరికా పౌరసత్వం పొందగానే కుటుంబాన్ని కూడా తీసుకువచ్చారు. ఆయన రైల్వే నిర్మాణ కార్మికుడుగా పనిచేశారు. ఆ తరువాత కెనడాలోని టొరెంటోలో పనిచేశారు.

ఉమ్మడి పాఠశాల విద్య పూర్తి అయిన తరువాత నేను టీచర్ ట్రైనింగ్ కోర్సు చదివాను. మిచిగన్‌లోని మన్‌రోలో కాన్వెంట్ టీచరుగా పనిచేశాను. తరువాత చికాగో వచ్చి దుస్తులు కుట్టే దుకాణాన్ని ప్రారంభించాను. నాకు చిన్నపిల్లల మీద పెత్తనం చేసే పనికన్నా బట్టలు కుట్టడమే నచ్చింది. కాని మళ్ళీ నేను టీచింగ్ వైపు వెళ్ళాల్సి వచ్చింది. ఈసారి టెన్నెస్సీలోని మెంఫిస్‌లో పనిచేశాను. ఇక్కడే 1861లో నా వివాహం జరిగింది. నా భర్త ఇనుమును పోత పోసే కార్మికుడు. లోహ పరిశ్రమ కార్మిక సంఘంలో సభ్యుడు కూడా.

1867లో మెంఫిస్ విషజ్వరాలతో(ప్లేగు) నిండిపోయింది. ఈ వ్యాధి పీడితుల్లో ఎక్కువ మంది పేదలు, కార్మికులే. సంపన్నులు నగరం వదిలి పారిపోయారు. స్కూళ్ళు, చర్చిలు మూతపడ్డాయి. అనుమతి లేకుండా విషజ్వర బాధితుల ఇళ్ళకు ఎవ్వరినీ వెళ్ళనిచ్చేవారు కాదు. పేదవారికి వైద్య సేవలు పొందే స్థోమత ఉండేదికారు. ఈ ప్లేగు మహమ్మారి వల్ల మా వీధిలో 10 మంది చనిపోయారు. మృత్యువు మమ్మల్ని చుట్టుముట్టింది. చనిపోయినవాళ్ళకు ఎలాంటి కర్మకాండలు జరపకుండానే రాత్రికి రాత్రే పూడ్చి పెట్టాల్సి వచ్చేది. నిత్యం చుట్టుప్రక్కల ఇళ్ళ నుండి ఏడ్పులు, రోదనలు వినపడుతుండేవి. నా నలుగురు పిల్లలు కూడా ఒకరి తరువాత ఒకరు ప్లేగుబారినపడి చనిపోయారు. వారి చిట్టి దేహాలకు నేనే స్నానాదికాలు చేయించి సమాధి చేయడానికి సిద్ధం చేశాను. నా భర్తకు కూడా జ్వరం పట్టుకుంది. అతనూ చనిపోయాడు. ఎన్నో రాత్రులు ఒంటరిగా విలపిస్తూ గడిపాను. నాలో నేనే కుమిలిపోయాను. నా దగ్గరికి వచ్చి ఓదార్చిన వారెవ్వరూ లేరు, రాలేని పరిస్థితి కూడా. చుట్టుపక్కల అన్ని ఇళ్ళలోనూ ఇదే దుస్థితి. పగలూ, రాత్రి కూడా శవాలను లాగే బండ్ల చక్రాల శబ్దాలతో పరిస్థితి హృదయ విదారకంగా ఉండేది.

**నా భర్తకు యూనియన్ వారే అంత్యక్రియలు జరిపారు. నేను ఒంటరిదాన్నయ్యాను. విషజ్వర బాధితులకు నాకు చేతనైన సహాయంచెయ్యాలని నిర్ణయించు కున్నాను. నర్సుగా పని చేసేందుకు నాకు అనుమతి దొరికింది. ప్లేగు వ్యాధి పూర్తిగా అంతరించేదాకా నా శక్తికొలది పని చేశాను.**

నా భర్తకు యూనియన్ వారే అంత్యక్రియలు జరిపారు. నేను ఒంటరిదాన్నయ్యాను. విషజ్వర బాధితులకు నాకు చేతనైన సహాయంచెయ్యాలని నిర్ణయించు కున్నాను. నర్సుగా పని చేసేందుకు నాకు అనుమతి దొరికింది. ప్లేగు వ్యాధి పూర్తిగా అంతరించేదాకా నా శక్తికొలది పని చేశాను.

నేను తిరిగి చికాగో వచ్చి, ఒక భాగస్వామితో కలిసి మళ్ళీ దుస్తులు కుట్టే వ్యాపారం మొదలుపెట్టాను. మా దుకాణాన్ని వాషింగ్టన్ వీధిలో పెట్టాం. అక్కడే

ఒక సరస్సు ఉండేది. మా కస్టమర్లు ఎక్కువ మంది దొరలు, కోటీశ్వరులూను. అందువల్లే నేను వాళ్ళ విలాసవంతమైన జీవితాలను, వారి వైభోగాలను దగ్గర నుండి చూడగలిగేదాన్ని. దొరల బట్టలు కుట్టేందుకు వారి బంగ్లాలకు వెళ్ళేదాన్ని. వాళ్ళ భవంతులు సరస్సు ఒడ్డున ఉండేవి. మిరుమిట్లు గొలిపే భవంతుల అద్దాల నుండి బయట పరిస్థితులు గమనించేదాన్ని. చలికి గజగజ వణుకుతున్న పేదలు ఆకలితో, నిరుద్యోగంతో బాధపడుతూ గడ్డకట్టిన ఆ సరస్సు గట్టున నడవడం చూసేదాన్ని. ఈ జీవితాల మధ్య వైరుధ్యమే నా మనస్సును కదిలించింది.

వేసవి కాలాల్లో పడమర వైపు నున్న మురికివాడల ప్రజలు చల్లగాలి కోసం సరస్సు దగ్గరకు చేరేవారు. ఆ మురికివాడల నుండి వచ్చే తల్లులను, పొత్తిళ్ళలో పసిబిడ్డలను, చిన్నారులను ధనవంతుల కిటికీల నుండి గమనించేదాన్ని. రాత్రుళ్ళు ఇళ్ళు వేడికి బిగుసుకుపోతుంటే ఆడ, మగ, పిల్లా జల్లా పార్కులలో పడుకునే వాళ్ళు. కానీ డబ్బున్న

మా రాజులు మాత్రం ఈ వేడి రాత్రుళ్ళు గడపడానికి సముద్రపు ఒడ్డుకి, పర్వతాల చెంతకు చేరేవారు.

1871 అక్టోబర్‌లో చికాగో మహానగరం ఘోర అగ్ని ప్రమాదానికి ఆహుతయ్యింది. నేను నా దుకాణంతో సహా సర్వస్వం కోల్పోయాను. ఈ అగ్ని ప్రమాదం వేలాది మందిని నిరాశ్రయులను

చేసింది. మేము ఆ రాత్రి, మరుసటి రోజు కూడా తిండి లేకుండా సరస్సు ఒడ్డున జాగారం చేశాము. మధ్య మధ్యలో చల్లదనం కోసం సరస్సులోకి వెళ్ళేవాళ్ళం. వాబాష్ అవెన్యూ పార్క్ దగ్గరలోని పాత సెయింట్ మెరీస్ చర్చిని, పెక్ కోర్టులను శరణార్థుల కోసం తెరిచారు. నేను కూడా మరో వసతి దొరికే వరకు అక్కడే వున్నాను.

ఆ దగ్గరలోనే మంటల్లో కాలి శిధిలమైన ఒక భవనంలో 'నైట్స్ ఆఫ్ లేబర్' సమావేశాలు జరిగేవి. 'నైట్స్ ఆఫ్ లేబర్' అనేది ఆరోజుల్లో వున్న ఒక కార్మికసంస్థ. నేను సాయంత్రాలు ఈ సమావేశాలకు వెళ్ళేదాన్ని. నాయకుల ఉత్తేజకరమైన ఉపన్యాసాలు వినేదాన్ని. ఆదివారాలు వీధుల్లోకి వెళ్ళి మీటింగులు పెట్టేవాళ్ళం.

ఆ రోజులు కార్మికుల కోసం త్యాగాలు చేసిన రోజులు. ఆరోజుల్లో కార్మికులు మీటింగులు పెట్టుకొనేందుకు సమావేశ మందిరాలంటూ ఉండేవి కావు. కార్మికుల శత్రువులతో విందులు లేవు. ఆనాటి పరిస్థితులు నేను కార్మికోద్యమంతో మమేక మయ్యేందుకు పురికొల్పినాయి. 1865లో అంతర్యుద్ధం ముగిశాక ఒక ప్రజాసమూహం కెంటకీలో గల లూయిస్‌విల్లేలో కలుసుకున్నారని, వారు ఉత్తర, దక్షిణ ప్రాంతాలనుంచి వచ్చారని విన్నాను. వాళ్ళని "బ్లూస్ & గ్రేస్" అని పిలిచేవారు. ఒకటి రెండు సం॥ల క్రితం వరకు వారు కట్టుబానిసత్వానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో ఒకరిపై ఒకరు కత్తులు నూరుకున్నారు. ఇప్పుడు ఇరు ప్రాంతాలవారూ కలిసి పారిశ్రామిక బానిసత్వానికి వ్యతిరేకంగా పోరాడేందుకు తీర్మానించుకున్నారు. ఈ తీర్మానంలో నుండే 'నైట్స్ ఆఫ్ లేబర్' ఆవిర్భవించింది.

చికాగో అగ్ని ప్రమాదం తరువాత నేను కార్మిక సంఘాలతో కలిసి పని చేయనారంభించాను. ఆ విధంగా 'నైట్స్ ఆఫ్ లేబర్' సభ్యురాల్ని అయ్యాను.

70వ దశకంలో మొదటి సమ్మె జరగడం నాకు గుర్తుంది. బాల్టిమోర్, ఓహియో రైల్ రోడ్ ఉద్యోగులు సమ్మె చేసారు. వారి ఆహ్వానం మేరకు వారికి సహాయపడేందుకు వెళ్ళాను. 1873లో సమ్మెను విచ్ఛినం చేసే దురుద్దేశ్యంతో పిట్స్‌బర్గ్ మేయర్, కొంతమంది పొగరుబోతు అధికారులను, సంఘవ్యతిరేక శక్తులను రంగంలోకి దించాడు. గవర్నర్ కూడా ఈ దుర్మార్గులకు మద్దతుగా సైన్యాన్ని పంపించాడు. వాళ్ళు ఆస్తులను కొల్లగొట్టారు. తగల బెట్టారు. దొమ్మీలు చేశారు. వీళ్ళు చేసిన అక్రమాలను సమ్మె చేస్తున్న కార్మికులపైకి నెట్టారు.

**ఆ రోజులు కార్మికుల కోసం త్యాగాలు చేసిన రోజులు. ఆరోజుల్లో కార్మికులు మీటింగులు పెట్టుకొనేందుకు సమావేశ మందిరాలంటూ ఉండేవి కావు. కార్మికుల శత్రువులతో విందులు లేవు. ఆనాటి పరిస్థితులు నేను కార్మికోద్యమంతో మమేకమయ్యేందుకు పురికొల్పినాయి. 1865లో అంతర్యుద్ధం ముగిశాక ఒక ప్రజాసమూహం కెంటకీలో గల లూయిస్‌విల్లేలో కలుసుకున్నారని, వారు ఉత్తర, దక్షిణ ప్రాంతాలనుంచి వచ్చారని విన్నాను. వాళ్ళని "బ్లూస్ & గ్రేస్" అని పిలిచేవారు.**

ఈ అల్లర్ల ఫలితంగా రైల్‌రోడ్ల యాజమాన్యాలు తమకు అనుకూలమైన ఒక చట్టాన్ని సాధించుకున్నారు. ఈ చట్టం ప్రకారం సమ్మెలోకి వెళ్ళదలుచుకున్న కార్మికులు ముందుగానే తమ రైళ్ళను లోకోమోటివ్ వర్క్‌షాపుకు (రౌండ్‌హౌస్) చేర్చాలి. ఈ చట్టాన్ని సమ్మెచేస్తున్న కార్మికులు నిజాయితీగా అమలు చేశారు. అందువల్ల పిట్స్‌బర్గ్‌లో సమ్మె సమయంలో పెద్ద సంఖ్యలో రైళ్ళు రౌండ్‌హౌస్‌కు చేరాయి.

ఒకరోజు రాత్రి అల్లర్లు జరిగాయి. అల్లరి మూకలు ట్రాక్‌ల మీదనున్న వందల కొద్దీ వ్యాగన్లను ఆయిల్‌లో ముంచి, తగలబెట్టి రౌండ్‌హౌస్‌కి పంపించడంతో రౌండ్‌హౌస్ కూడా తగలబడింది. పెన్సిల్వేనియా రైల్ రోడ్డు కంపెనీ వాళ్ళ రైళ్ళు వందల సంఖ్యలో తగలబడ్డాయి. అది ఒక కాళరాత్రి. మంటలు ఆకాశాన్ని అంటుకున్నాయి. ఆ మంటలే సైనికుల చేతిలోని తుపాకులను సమ్మె చేస్తున్న కార్మికులపైకి ఎక్కుపెట్టేవిగా చేశాయి.

సమ్మె చేస్తున్న కార్మికులు గృహదహనాలు, అల్లర్లు వంటి నేరాలు చేశారన్న ఆరోపణలు ఎదుర్కొన్నారు నిజానికి ఈ నేరాలు చేసింది పిట్స్‌బర్గ్ వ్యాపారస్థుల అండగల అల్లరిమూకలని అందరికీ తెలుసు. ఈ రైల్ రోడ్డు కంపెనీ ఛార్జీల విషయంలో తమ పట్ల వివక్ష చూపిస్తున్నదని పిట్స్‌బర్గ్ వ్యాపారస్థులు భావించడమే ఈ అల్లర్ల వెనుకనున్న అసలు కారణం. ఎందుకంటే రైల్‌రోడ్డు కంపెనీ రేట్లు పిట్స్‌బర్గ్ నగరంలో ఎక్కువగా ఉన్నాయని వారు భావించారు.

సమ్మె నిర్వాహకులు నాకు వ్యక్తిగతంగా తెలుసు. వారు చట్టాన్ని అతిక్రమించలేదు. పైగా చట్టానికి బద్ధులై ఉండాలని వారి సభ్యులకు ఎలా నచ్చచెప్పారో, హింసకు పాల్పడకుండా వారి సభ్యులను ఎలా కట్టడి చేశారో నాకు తెలుసు. రైల్ రోడ్ కంపెనీ ఆస్తులను ఎవరు ధ్వంసం చేశారో అందరికీ తెలుసు. కార్మికులు 'ఇతరులు చేసిన పాపాల శిలువను మొయ్యాలని, ఇతరులు చేసిన తప్పుల ఫలితాలను అనుభవించాలని' నా తొలి రోజుల్లోనే నేర్చుకున్నాను. నేటికీ అదే చరిత్ర పునరావృతమవుతోంది.

అవి అమెరికా పారిశ్రామిక జీవితపు తొలి సంవత్సరాలు. ఫ్యాక్టరీల అభివృద్ధి, రైల్ రోడ్ల విస్తరణ, పెట్టుబడి పోగుపడడం, బ్యాంకులలో ప్రగతి, వాటితోపాటు వచ్చిన

**సమ్మె నిర్వాహకులు నాకు వ్యక్తిగతంగా తెలుసు. వారు చట్టాన్ని అతిక్రమించలేదు. పైగా చట్టానికి బద్ధులై ఉండాలని వారి సభ్యులకు ఎలా నచ్చచెప్పారో, హింసకు పాల్పడకుండా వారి సభ్యులను ఎలా కట్టడి చేశారో నాకు తెలుసు. రైల్ రోడ్ కంపెనీ ఆస్తులను ఎవరు ధ్వంసం చేశారో అందరికీ తెలుసు. కార్మికులు 'ఇతరులు చేసిన పాపాల శిలువను మొయ్యాలని, ఇతరులు చేసిన తప్పుల ఫలితాలను అనుభవించాలని' నా తొలి రోజుల్లోనే నేర్చుకున్నాను. నేటికీ అదే చరిత్ర పునరావృతమవుతోంది.**

కార్మిక వ్యతిరేక చట్టాలు-అన్నీ కలిసినవే ఈ మొదటి సంవత్సరాలు. వీటన్నిటితోపాటు సమ్మెలూ వచ్చాయి. హింసా వచ్చింది. చట్టసభ సభ్యులు పెట్టుబడిదారుల కోసమే వున్నారని, కార్మికుల కోసం లేరన్న సత్యం కార్మికుల మనసుల్లో నాటుకు పోయింది.

**పాద సూచిక:**

"బ్లూస్ అండ్ గ్రేస్ - 1860-65 సంవత్సరాల మధ్య అమెరికాలో జరిగిన సివిల్‌వార్‌లో సైనికుల యూనిఫారాల రంగులు. ఉత్తర సైనికులు బూడిద (గ్రే) రంగు యూనిఫారాలు ధరించేవారు. ఆనాటికి అమెరికాలో ఉత్తర ప్రాంతం పరిశ్రమలకు, దక్షిణ ప్రాంతం వ్యవసాయానికి ప్రసిద్ధి. దక్షిణ ప్రాంతంలో బానిస యజమానులు భారీ వ్యవసాయ క్షేత్రాల్లో ప్రత్తి పండించేవారు. 1800 సంవత్సరంలోనే నల్లజాతి బానిసల వ్యాపారం నిషేధించినప్పటికీ ప్రత్తి పొలాల్లో బానిసల చేత పని చేయించడం ఆగలేదు. బానిస వ్యవస్థ నశిస్తేనే వాళ్లకు స్వేచ్ఛ లభించేది. ఉత్తరాదిన ఉన్న పరిశ్రమల్లో పనిచేయడానికి కార్మికులు దొరికేదీను. ఇంకా మిగిలి ఉన్న బానిస వ్యవస్థ రద్దుకోసం యునైటెడ్ స్టేట్స్ నుండి విడిపోయి కాన్ఫెడరేన్‌గా ఏర్పడ్డ దక్షిణాది రాష్ట్రాలకు, అబ్రహం లింకన్ సారధ్యంలో ఉత్తరాది రాష్ట్రాలకు ప్రాతినిధ్యం వహిస్తున్న యునైటెడ్ స్టేట్స్‌కు మధ్య అంతర్యుద్ధం జరిగింది. యుద్ధంలో ఆరు లక్షల మంది సైనికులు హతమయ్యారు. చివరికి యూనియన్ సైన్యాల చేతిలో దక్షిణ రాష్ట్రాలు ఓటమి పాలయ్యాయి.

**(తరువాయి భాగం వచ్చే సంచికలో)**

కథ

# కొత్త వాచీ

-పి. షహనాజ్



ఆరోజు సునంద ఆనందానికి హద్దులేకుండా పోయింది. కారణం. ఎన్నో ఏళ్ళుగా పెంచుకున్న కోరిక ఒకటి ప్రస్తుతం తీరబోతోంది.

ఆమెకు భూమిపై కాళ్ళు ఆనడంలేదు. సంతోషంగా గిరగిరా తిరుగుతూ ఇంట్లో పనులను చేసుకోసాగింది.

పాతికేళ్ళక్రితం తన పెళ్ళినాడు తనవాళ్ళు బహుమతిగా యిచ్చిన చేతివాచీనే యిన్నేళ్ళు పెట్టుకుని తిరుగుతోంది. దానికి రిపేర్ వచ్చినప్పుడల్లా పదోపరకో యిచ్చి వాచీల షాపులో బాగు చేయించుకోవటం తప్ప కొత్త వాచీల జోలికి వెళ్ళే భాగ్యం కలగలేదు.

అలాగని కొత్తవాచీ కొనే స్తోమత లేని కుటుంబం కాదు. కానీ - అంతకంటే ముఖ్యమైన అవసరాలు ఎప్పటి కప్పుడు వచ్చి పడ్తుండటంతో ఆ ఆలోచనను మానుకోవాల్సి వచ్చేది.

మంచి కంపెనీవి వెయ్యి రూపాయిలకు లోపే లభిస్తాయి. కానీ తనకోసం, తన వాచీకోసం వెయ్యి రూపాయలు ఖర్చుపెట్టాలంటే మొదట ఆమె మనసొప్పటం లేదు.

ఆమె భర్త ఆనందరావుకు ఓ సంస్థలో మంచి ఉద్యోగమే. జీతం నాలుగంకెలు వస్తాయి. కానీ అదేం చోద్యమోకానీ జీతం వచ్చినట్లు వచ్చి ఖర్చయిపోతుంది. ఇంట్లో ముగ్గురు పిల్లలు. వారి ఖర్చులేమీ తక్కువ కావు.

వాళ్ళ ఫీజులు, బట్టలు, పుస్తకాలు, రవాణా ఖర్చులు, వాళ్ళ పుట్టిన రోజులు, ఇక ఇంటి అద్దె, పాలవాడికి, పనిమనిషి జీతం, ఇంట్లో నిత్యావసర వస్తువులు వగైరాలు. అబ్బో తడిసి మోపడవుతోంది.

ప్రతి ఒకటో తారీఖున పాలవాడికి డబ్బులు ఇస్తున్నప్పుడు భర్త గొణగటం పరిపాటి.

"మనకు వెయ్యి రూపాయల పాలెందుకు? తక్కువ తీసుకో. రేపట్నుంచి తగ్గించెయ్యి. మొదట్లో మూడు వందలో నాలుగువందలో అయ్యేవి ! అలా భర్త గింజుకుంటుంటే నవ్వాలో, ఏడ్వాలో అర్థంకాక, " అయ్యో, ఖర్మ. నేను పాలు ఎక్కువగా తీసుకోవటంలేదు. మునుపటిలాగానే తీసుకుంటున్నాను. కాకపోతే పాలధర పెరిగింది. మొదట

**తన చేతి గడియారానికి రిపేర్ వచ్చినప్పుడు షాపుకు వెళ్ళిన సందర్భాల్లో అక్కడ అద్దాల పెట్టెల్లో ఉన్న రకరకాల ధరలను కలిగిన వాచీలను చూసి తరించేది. తనకు అందుబాటులో గల ధరలు కలిగిన చేతి గడియారాలను ఎన్నుకొని పెట్టుకుంది. డబ్బులు వచ్చినప్పుడు దానిని కొనుక్కుని తీసుకువెళ్తానని చెప్పి వచ్చింది.**

**ఉన్నట్టుండి ఆమెకేదో గుర్తుకొచ్చింది. వెంటనే లేచి వెళ్ళి క్యాలెండర్‌లో తేది చూసింది. అవును ఎల్లుండి తమ చిన్నకూతురు పుట్టిన రోజు. తను ఎన్నో రోజులుగా ఓ మంచి డిజైన్ గల కొత్త మోడల్ డ్రెస్ అడుగుతోంది. తన భర్తకి అలాంటి క్రొత్త రకం దుస్తులు నచ్చవు. అతను ఎప్పటికీ కొనివ్వడు. తనే ఆ డ్రెస్ కొని పెట్టి చిన్నకూతురు ముచ్చటను తీర్చాలి. బట్టలషాపుకు వెళ్ళి కూతురికి నచ్చిన ఆ డ్రెస్‌ను కొనితెచ్చి ఆశ్చర్యపర్చాలి. ఈ ఆలోచన రాగానే ఆమెలో ఏదో తెలియని ఆనందం గంతులు వేసింది.**

లీటరు పాలు పదిరూపాయలకు వచ్చేవి. ఇప్పుడు దాదాపు నలభై రూపాయలవుతున్నాయి. పనిమనిషికి మొదట వంద రూపాయలు యిచ్చేవాళ్ళు. ఇప్పుడు కనీసం వెయ్యి రూపాయలు ఇవ్వందే ఇళ్ళలో పనిచేయడానికి రావటంలేదు. అలాగే అన్నీను. ధరలు నాలుగు రెట్లు నుంచి పదిరెట్లు ఎక్కువగా పెరిగాయి" అంటూ ఏకరవు పెట్టుకునేది. అప్పటికీ ఎంత పొదుపుగా చేసుకున్నా ఆక్కడికక్కడికే సరిపోతుంది. పండగలకో పెళ్ళిళ్ళకో చీరపై ఓ జాకెట్టు కుట్టించుకుందామన్నా అది కుడా గగనమై పోతుంది. బ్లౌజు మీటరు ధర ఏ నూట యాభైయ్యో రెండు వందలో అయితే దానిని కుట్టడానికి కూడా అంతే తీసుకుంటున్నారు. ఇవన్నీ అనివార్య ఖర్చులు. మధ్యతరగతి కుటుంబీకులకు ఇవన్నీ కానరాని ఖర్చులు.ఇలాంటి పరిస్థితుల నేపథ్యంలో తనకోసం కొత్త వాచీ కొనడం వాయిదా పడుతూ వస్తోంది.

తన వాచీ విషయం ఎప్పుడయినా భర్త దగ్గర, పిల్లల దగ్గర ప్రస్తావిస్తే, " ఇక నువ్వు వాచీ పెట్టుకుని ఏ ఆఫీసుకు వెళ్ళాలి? ఏ రాచకార్యాలు వెలగబెట్టాలి. ఇంట్లో పడి ఉండేదానివి. నీకు వాచీ ఎందుకు? టైముతో పనేముంది? ఎప్పుడో ఏ ఫంక్షన్లకో వెళ్ళినప్పుడు కదా. నీకు ఆ పాత వాచీ చాల్లే" అంటూ తీసి పారేసినట్లు మాట్లాడేవాళ్ళు. దాంతో సునంద సమయం కోసం వేచి చూడసాగింది. ఎప్పుడు తనకు కాలం కలిసి వస్తుందా ఎప్పుడు తనచేతికి అందమైన కొత్త వాచీ వరిస్తుందా అంటూ కలలు కనసాగింది.

భర్త వాడి ప్రక్కన పడేసిన పాత రకం వాచీని పెట్టుకుని ఫంక్షన్లకు వెళ్తుండేది. కానీ అది మగవాళ్ళు వేసుకునే వాచీ కావడంతో ఆమె ముచ్చట చాన్నాళ్ళు సాగలేదు. తన చేతివంక అందరూ విచిత్రంగా చూస్తున్నట్లనిపిస్తే తీసి తిరిగి దానిస్థానంలో పెట్టేసింది.

తన చేతి గడియారానికి రిపేర్ వచ్చినప్పుడు షాపుకు వెళ్ళిన సందర్భాల్లో అక్కడ అద్దాల పెట్టెల్లో ఉన్న రకరకాల ధరలను కలిగిన వాచీలను చూసి తరించేది. తనకు అందుబాటులో గల ధరలు కలిగిన చేతి గడియారాలను ఎన్నుకొని పెట్టుకుంది. డబ్బులు వచ్చినప్పుడు దానిని కొనుక్కుని తీసుకువెళ్తానని చెప్పి వచ్చింది.

ఆ అవకాశం యింత తొందరగా వస్తుందని ఊహించలేక పోయింది. తమ ఊళ్ళో ఉన్న పొలాల్లో పండిన పంటలకు మంచి రాబడి వచ్చిందని చెబుతూ ఆమె చేతికి ఓ అయిదు వేలిచ్చి నువ్వు చీరో సారో కొనుక్కో తల్లీ అంటూ ఆమె అన్నయ్య మొన్న యిచ్చి వెళ్ళాడు. ఆ అయిదు వేలల్లో నాలుగు వేలు ఖర్చు పెట్టేసింది. భర్త అర్జంటుగా ఎవరికో రెండు వేలు అప్పు తీర్చాలని జీతం అందగానే ఆ డబ్బులు తిరిగి యిచ్చేస్తానని చెప్పి తీస్కెళ్ళాడు. కానీ ఆ డబ్బులు ఎప్పటికీ తిరిగి రావని తెలిసినా ఇవ్వక తప్పలేదు. మరో వెయ్యి రూపాయిలు కొడుకు మోటారు సైకిలుకు రిపేర్‌కు యివ్వవల్సి వచ్చింది. తండ్రికి చెబితే కోప్పడతాడని మెల్లిగా తల్లి దగ్గర లాక్కున్నాడు. మరో వెయ్యి రూపాయిలు కూతురు అకస్మాత్తుగా జబ్బుపడితే ఆ సమయంలో భర్త అందుబాటులో లేకపోవడంతో వెయ్యి రూపాయల దాక ఖర్చుపెట్టవల్సి వచ్చింది. కానీ కూతురుకు నయం కావటమే తనకు సంతోషమనిపించింది. డబ్బుదేముంది తనబిడ్డ ఆరోగ్యవంతురాలయిందని సంతోషపడక తప్పదు.

ఓ మంచి రోజు చూసుకుని శుభ ఘడియలో వాచీ కొందామన్న ఆమె ఆలోచనతో కొన్ని రోజులు గడిచి పోవటంతో యిన్ని అవాంతరాలు జరిగిపోయాయి.

ఇక మిగిలిన ఆ వెయ్యి రూపాయలను పట్టుకు వెళ్ళి తాను చూసి వచ్చిన ఆ అందమైన వాచీని కొందామని ఆ వేళ హడావుడి పడిపోతోంది. ఏది ఏమైనా ఆ రోజు తన కోరికను తీర్చుకోవాలని ఉవ్విళ్లూరసాగింది.

భర్త అటు బయటకు వెళ్ళగానే వంట తొందరగా ముగించుకుని ఎప్పుడెప్పుడు షాపులు తెరుస్తారా అని ఎదురుచూడ సాగింది.

ఉన్నట్టుండి ఆమెకేదో గుర్తుకొచ్చింది. వెంటనే లేచి వెళ్ళి క్యాలెండర్‌లో తేది చూసింది. అవును ఎల్లుండి తమ చిన్నకూతురు పుట్టిన రోజు. తను ఎన్నో రోజులుగా ఓ మంచి డిజైన్ గల కొత్త మోడల్ డ్రెస్ అడుగుతోంది. తన భర్తకి అలాంటి క్రొత్త రకం దుస్తులు నచ్చవు. అతను ఎప్పటికీ కొనివ్వడు. తనే ఆ డ్రెస్ కొని పెట్టి చిన్నకూతురు ముచ్చటను తీర్చాలి. బట్టలషాపుకు వెళ్ళి కూతురికి నచ్చిన ఆ డ్రెస్‌ను కొనితెచ్చి ఆశ్చర్యపర్చాలి. ఈ ఆలోచన రాగానే ఆమెలో ఏదో తెలియని ఆనందం గంతులు వేసింది.

తనకు వాచీ కొనాలన్న ఆలోచనకి స్వస్తి పలికింది.

మరో గంటకి ఆమె ఓ వాచీ షాపుకు చేరుకుంది. కానీ కొత్త వాచీ కొనటానికి మాత్రం కాదు.

ఓ పదో పరకో యిచ్చి తన పాత వాచీని రిపేరు చేయించుకోవటానికి మాత్రమే...



# ఈ పూతలే అందమా?

-వి. ఆశా భారతి





"నేను పెద్దయి పెళ్ళయిన తర్వాత నా భర్తతో కలిసి టివి చూసేటప్పుడు వాటిలో వచ్చే ఫెయిర్‌నెస్ క్రీముల ప్రకటనలు చూసి నా భర్త ఎలా ఫీలవుతాడో, నన్ను అసహ్యించుకుంటాడా.... అసలు నాకు పెళ్ళి అవుతుందా" లాంటి అనుమానాలను ఇప్పటి టీనేజ్ పిల్లలు ఆలోచించేలా ప్రకటనలు ఉంటున్నాయి. టివిలో వస్తున్న ప్రకటనలు మనల్ని అంతలా ప్రభావితం చేస్తున్నాయి. ఉదాహరణకు ఒక ప్రకటన....

వాళ్ళ " నాన్న పెళ్ళి ప్రపోజల్ తెస్తాడు, కానీ, తనకు పెళ్ళి చేసుకోవడం ఇష్టం లేదు. కాని నాన్న మంచి సంబంధం అని చెప్పగానే మెత్తబడుతుంది. తన స్నేహితురాలితో నాన్న చెప్పింది కూడా నిజమే కదా అంటుంది. అయితే నువ్వు పెళ్ళికి సిద్ధమయిపో అంటూ ఒక క్రీమ్‌ను చేతిలో పెడుతుంది తన స్నేహితురాలు. తను ఆ క్రీమ్ రాసుకున్న తర్వాత తనలో ఆత్మవిశ్వాసం పెరిగి నేను తనలా మంచి ఉద్యోగం, మంచి ఇల్లు కట్టుకున్న తర్వాతే ఇక పెళ్ళి అంటుంది." అంటే అప్పటి వరకు తన జీవితం మీద తనకే నమ్మకం లేదా చెప్పండి. ఇలాంటి ప్రకటనలను చూసినప్పుడల్లా ఈతరం అమ్మాయిలను ఇవి ఎంత ప్రభావం చేస్తున్నాయో అనిపిస్తుంది. దీనికి ఉదాహరణే దేశంలో ఫెయిర్‌నెస్ క్రీమ్‌ల మార్కెట్ మూడు వేలకోట్లు పైమాటే. మరి ఇంత మార్కెట్ కల్పిస్తున్నామంటే మనం ఎంతలా వాటిని వాడుతున్నామో అర్థమవుతుంది.

## రంగుల్లో తేడాలు

ఆయా దేశాల వాతావరణ పరిస్థితులను బట్టి మనిషి రంగులో తేడాలు వచ్చాయి. మంచు ప్రాంతంలో తెల్లగా, గులాబిలా ఉంటారు. అదే ఉష్ణోగ్రత ఎక్కువగా ఉండే ప్రాంతాలు అంటే మన భారతదేశంలాంటి ప్రాంతాల ప్రజలు కొంచెం చామనఛాయగా, నల్లగా, తెల్లగానూ ఉంటారు. మరి ఇలాంటి వాతావరణ పరిస్థితులకు మనం కారణం ఎలా అవుతాం? చెప్పండి. కాని, మీడియాలో వస్తున్న అనేక రకాల ప్రకటనలు మనకు రంగు లేకపోతే ఎందులోనూ ముందుకు పోలేమని, జీవితంలో అనుకున్నవి సాధించలేమని ప్రచారం చేస్తున్నాయి. తెల్లగా ఉంటేనే అనుకున్నవన్నీ నేరవేరుతాయని ఎక్కడా నిరూపణ కాలేదు కదా! మరి ఇలాంటి ప్రకటనలను చూసి మనం పిచ్చివాళ్ళలా వాటిని పాటిస్తూ లేనిపోని సమస్యలను కొని తెచ్చుకుంటున్నాం.

## ప్రకటనలే గీటురాయా....

ఒకప్పుడు దేశంలో హిందూస్థాన్ యునిలీవర్ వారి ఫెయిర్ అండ్ లవ్లీ (1975) మాత్రమే ఉండేది. కానీ నేడు అనేక క్రీమ్‌లు మార్కెట్‌లోకి వచ్చాయి. వారు తమ మార్కెట్‌ను పెంచుకోవడానికి అమ్మాయిల ఆత్మవిశ్వాసాన్ని దెబ్బతినేలా పెళ్ళి, ఉద్యోగాలు గురించే ఎక్కువగా ప్రకటనలను తయారుచేస్తున్నారు. అందాలపోటీలను నిర్వహిస్తూ అమ్మాయిలను మార్కెట్ సరుకుగా మార్చేస్తున్నారు. ఇలాంటి ప్రకటనలను చూసి మార్కెట్‌లో దొరుకుతున్న ఫెయిర్‌నెస్ క్రీంలు, ఫేస్‌వాష్‌లు, లోషన్‌లను వాడటం వలన అనేక సమస్యలను కొనితెచ్చుకుంటున్నారు. నిజంగానే అమ్మాయిల అందానికి, ఆత్మవిశ్వాసానికి ఈ క్రీమ్‌లే గీటురాయా....

ఈ ఫెయిర్‌నెస్ క్రీమ్‌లు వారి చర్మతత్వానికి సరిపోతున్నాయో లేదో కూడా

### ఎ.ఎస్.సి.ఐ కొత్త నిబంధనల ప్రకారం

- ప్రకటనల వల్ల ప్రత్యక్ష్యంగా కాని, పరోక్షంగా కాని నల్లగా ఉండేవారు అందంగా లేరని చెప్పేటట్టుగా ఉండకూడదు. వారి మనోభావాలు దెబ్బతినకుండా, ఒత్తిడికి లోనవకుండా, రంగు వలన ఎలాంటి ఇబ్బందులకు గురికాకుండా ఉండాలి.
- ప్రకటనలలో నల్లగా ఉండటం వలన కలిగే అనుకూలతలను వర్ణించకూడదు. నల్లగా ఉండటం వెనకబాటుతనంగా చూపకూడదు.
- క్రీమ్‌లను వాడిన తర్వాత వచ్చే ఫలితాలను చూపి, ఉత్పత్తి సామర్థ్యం ఎంతో తెలుపుతూ అమ్మకాలు పెంచుకోవాలని చూడకూడదు.
- ప్రకటనలు కులాన్ని, మతాన్ని రంగును, జాతిని, ఆర్థిక సామాజిక వర్గాలను, వృత్తిని దెబ్బతీసేలా,దెప్పి పొడిచేలా ఉండకూడదు.
- చర్మం రంగును బట్టి ఎటువంటి లింగ వివక్షను చూపకూడదు.

ఆలోచించకుండా వాటిని వాడి చివరకు చర్మం పొక్కినట్లుగా అవ్వడం, చర్మంపై మచ్చలు ఏర్పడటం, కందిపోయి ముందుకన్నా అసహ్యంగా తయారవ్వడం లాంటి సమస్యలతో బాధపడుతున్నవారూ ఉన్నారు. ఒక అడుగు ముందుకు వేసి క్రీమ్ పరిశ్రమలపై కోర్టులను ఆశ్రయిస్తున్నవారూ ఉన్నారు. ఇలాంటి ఎన్నో కేసులను చూస్తున్న అడ్వర్టైజింగ్ స్టాండర్డ్స్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా (ఎ.ఎస్.సి.ఐ) వారు కొత్తగా కొన్ని నియమ నిబంధనలను ఏర్పాటుచేస్తున్నారు. వాటిని పాటించాలి. క్రీమ్ కంపెనీలు వారి ప్రకటనలలో మార్పులు చేసుకోవాలని హెచ్చరించారు. వీటిని కంపెనీలు కూడా స్వాగతిస్తున్నాయి.

**గార్నియర్ ప్రతినిధి ఏమంటున్నారంటే :**

ఫెయిర్‌నెస్ క్రీమ్ ప్రకటనలలో వ్యక్తిగత విమర్శలకు తావులేకుండా, వినియోగ దారుల ఆత్మగౌరవాన్ని రక్షించేలా ప్రకటనలు ఉండటం స్వాగతించదగింది. అంతేకాదు, ఉత్పత్తుల శాస్త్రీయతను వివరించడానికి ఇవి ఎంతో ఉపయోగం. ఎ.ఎస్.సి.ఐ వారి కొత్త నిబంధనలు ఇంకా ముసాయిదా రూపంలోనే ఉన్నాయి. అయినా మా ప్రకటనలలో వాస్తవికతను వివరించడానికి ఈ నిబంధనలు ఎంతో తోడ్పడుతాయని" హిందూస్థాన్ యునిలీవర్ ప్రతినిధి అంటున్నారు.

మరి ఇలాంటి క్రీమ్‌లను వాడేటప్పుడు వాటి మీద ఉండే వివరాలను చూసి వాడటం ముఖ్యం. అంతేకాదు, నిపుణుల సలహాతో వినియోగించడం అన్నింటికన్నా ఉత్తమం. వీటన్నింటి కన్నా మన రంగుకున్న వాస్తవికతను గుర్తించి సహజంగా ఇంట్లో దొరికే వాటితో చర్మాన్ని తాజాపరుచుకోవడం అన్నింటికన్నా మిన్న. ★

**ఆయా దేశాల వాతావరణ పరిస్థితులను బట్టి మనిషి రంగులో తేడాలు వచ్చాయి. మంచు ప్రాంతంలో తెల్లగా, గులాబీలా ఉంటారు. అదే ఉష్ణోగ్రత ఎక్కువగా ఉండే ప్రాంతాలు అంటే మన భారతదేశంలాంటి ప్రాంతాల ప్రజలు కొంచెం చామనఛాయగా, నల్లగా, తెల్లగానూ ఉంటారు. మరి ఇలాంటి వాతావరణ పరిస్థితులకు మనం కారణం ఎలా అవుతాం? చెప్పండి. కాని, మీడియాలో వస్తున్న అనేక రకాల ప్రకటనలు మనకు రంగు లేకపోతే ఎందులోనూ ముందుకు పోలేమని, జీవితంలో అనుకున్నవి సాధించలేమని ప్రచారం చేస్తున్నాయి.**

శాస్త్రీయం

# ఎదుగుతున్న వయస్సు (టీనేజీ)

డా॥ఎం. రమాదేవి

బాల్యానికి, యవ్వనానికి మధ్య దశ ఈ టీనేజ్. (కౌమారదశ). ప్రతి మనిషీ తన జీవిత కాలంలో యువతి లేక యువకుడిగా మారడానికి ముందు ఈ దశను ఎదుర్కోకతప్పదు. ఈ కాలాన్నే ఎడొలసెన్స్ అని కూడా అంటున్నాము. ఇది ప్రకృతిపరమైన సహజ సాధారణ మార్పు. ఈ పరివర్తనా కాలంలో పిల్లల్లో ఏర్పడే మార్పులు కొంత గందరగోళంగా వుంటాయి. వీటిని అర్థం చేసుకోవడం పెద్ద సమస్య. ఈ సమస్య అటు తల్లిదండ్రులకు ఇటు టీనేజి పిల్లలకు కూడా ఉంటుంది. ఈ వయస్సు పిల్లలున్న తల్లిదండ్రులు ఏ ఇద్దరు కలిసినా తమ పిల్లల ప్రవర్తన గురించి చర్చించుకోవడం చూస్తుంటాము. ఈ నేపథ్యంలో ఈ దశలో వచ్చే శారీరక, మానసిక మార్పుల గురించి క్లుప్తంగా తెలుసుకుందాం.

**శారీరకంగా అపరిపక్వ దశనుండి పరిపక్వ దశకు మారడాన్ని "ప్యుబర్టీ" అంటాము. యుక్త వయస్సు చాలా నాజూకు దశ. బాల్యం దాటి యవ్వనంలోకి అడుగుపెట్టే 10-18 ఏళ్ళ వయస్సు ఎంతో కీలకమైనది. ఒక బాలిక స్త్రీగా ఎదగడానికి, ఒక బాలుడు నవ యువకుడిగా మారటానికి మధ్య పలుకరించే దశ. మన దేశ జనాభాలో 25శాతం మంది ఈ కీలకమైన యుక్త వయస్సులోనే వున్నారు. శారీరకంగా, మానసికంగా, వ్యక్తిపరంగా, లైంగికంగా ఎన్నో ఒడిదుడుకులు ఎదురయ్యే దశ ఇది.** నవ యవ్వన ప్రాయంలో అడుగిడుతున్న ఈ పసి హృదయాలలో ఎన్నో ప్రశ్నలు, ఊహలు, ఊసులు, అభిలాషలు తారాడుతుంటాయి. ఈ వయస్సులోనే ఆడపిల్లలకు, మగపిల్లలకు ఒకరంటే ఒకరికి ఆకర్షణ మొదలవుతుంది.

**మరి ఏది ప్రేమ? ఏది ఆకర్షణ?**

యుక్త వయస్సులో హార్మోన్ల ప్రభావం వల్ల మగపిల్లలకు ఆడపిల్లల పట్ల కొంత ఆకర్షణ, ప్రేమ ఉండడం సహజం. దీన్ని విపరీతమైన అంశంగా తీసుకోవలసిన పనిలేదు. ఆకర్షణ కలిగినంత మాత్రాన దాన్ని ప్రేమగా భావించాల్సిన అవసరం లేదు. స్నేహానికి, ప్రేమకూ మధ్య బేధాన్ని గుర్తించటం ముఖ్యం.

ప్రేమ అనేది ఎంతో బాధ్యతతో కూడుకున్నది. భాగస్వామి పట్ల గురుతర బాధ్యత స్వీకరించగలగాలి. దాన్ని జీవితాంతం నెరవేర్చడానికి సిద్ధపడాలి. అందులోనే ఆనందం పొందగలగాలి. ఇందులో బాధ్యత, తనకున్నది ఇవ్వడమే గానీ తీసుకోవాలన్న కాంక్ష వుండదు. కేవలం ఆకర్షణలో, ధ్యానంతా తీసుకోవటం మీదే వుంటుంది. ప్రేమతో నేనేమి ఇవ్వగలనని ఆలోచిస్తే ఆకర్షణలో నాకేమి దక్కుతుందన్న ధ్యాస వుంటుంది. అందుకే తను కోరుకున్నది దక్కనప్పుడు యాసిడ్ దాడులు వంటివి, హత్యలు చేయడం లాంటివి చూస్తున్నాము. ఈ విషయాలన్నీ ప్రతి అమ్మాయి, అబ్బాయి గుర్తించాలి. తల్లిదండ్రులూ పిల్లలతో స్నేహితుల మాదిరిగా మెలగడం వల్ల తమకొచ్చిన అనేక సందేహాలు వారితో నివృత్తి చేసుకునే అవకాశం వుంది. ●

# సీమాంధ్రలో మహిళల స్థితిగతులు

- ప్రొ॥ చల్లపల్లి స్వరూపరాణి

భారతీయ సమాజంలో మహిళలు ద్వితీయశ్రేణి పౌరులుగానే చూడబడుతున్నారు. పురుషులతో పోల్చినపుడు అన్నింటా తక్కువగా చూడబడుతున్నారు. వారికి నామమాత్రపు హక్కులు మాత్రమే ఇవ్వబడుతున్నాయి. వీరి ఇంటిచాకిరిని వెలకట్టేవాడు లేడు. చరిత్రకారులు, సామాజిక శాస్త్రవేత్తలు వీరి చరిత్రను విస్మరిస్తున్నారు. ఇటీవలి కాలం వరకూ వీరికి కనీసపు హక్కులు కూడా నిరాకరిస్తూ వచ్చింది. సమాజం కానీ దేశ నిర్మాణంలో మహిళలు నిర్వహిస్తున్న పాత్ర అనమానమైనది. మానవ పరిణామక్రమంలోనూ, నాగరికత అభివృద్ధిలోను వీరు అమోఘమైన పాత్ర నిర్వహించారు. సామాజిక, రాజకీయ ఉద్యమాలు అన్నింటిలోనూ స్త్రీలు చురుగ్గా పాల్గొన్నారు.

ఆంధ్రాలో సాంఘిక సంస్కరణోద్యమం ప్రారంభం నుండి వీరు క్రియాశీలక పాత్ర వహించారు. సహాయ నిరాకరణ ఉద్యమం, మార్క్సిస్టు, లెనినిస్టు ఉద్యమం, సారా వ్యతిరేక ఉద్యమం, దళిత ఉద్యమం, మహిళా ఉద్యమాల్లోనే కాక ఇతరత్రా ప్రజా ఉద్యమాల్లోనూ వీరు వీరోచితంగా పాల్గొన్నారు. మహిళల హక్కుల కోసం సాగిన అనేక పోరాటాల్లో పాల్గొన్నారు. అయినప్పటికీ విధాన నిర్ణాయక అధికారంలో వీరికి ఎలాంటి పాత్ర లభించడం లేదు.

ఐద్యా రాజ్యసమితి 1975-85 దశకాన్ని అంతర్జాతీయ మహిళా దశాబ్దంగా ప్రకటించింది. ఇది భారతదేశంలోనూ ప్రత్యేకించి ఆంధ్రప్రదేశ్ మహిళా ఉద్యమ చరిత్రలో దీన్నొక మైలురాయిగా అభివర్ణించారు. భారతదేశంలో మహిళల స్థితిగతులను అధ్యయనం చేసేందుకు ప్రొ॥ వీణా మంజుదార్ ఆధ్వర్యంలో ఒక కమిటీని కేంద్ర ప్రభుత్వం నియమించింది. ఈ కమిటి సర్వే జరిపి తమ నివేదికను సమర్పించింది. వివిధ రంగాల్లో మహిళల పరిస్థితి అధ్వాన్నంగా ఉందని ఆ కమిటి స్పష్టంగా పేర్కొంది.

మహిళల స్థితిగతులపై, అలాగే ఆంధ్రప్రదేశ్‌లో మహిళా ఉద్యమంపైన మేధోపరమైన, మేధనేతర పరంగానూ చర్చలు చాలా సాగాయి.

**ఆర్థిక రంగంలో మహిళల పాత్ర:-**

గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో మహిళలు కీలకపాత్ర పోషిస్తున్నారు. వ్యవసాయంపై ఆధారపడిన మన ఆర్థిక వ్యవస్థలో వ్యవసాయ కూలీలుగా వీరు చాలా ముఖ్యమైన భూమిక వహిస్తున్నారు. వ్యవసాయాధారిత పరిశ్రమలు, వ్యవసాయ అనుబంధ కార్యకలాపాలు వీరు లేనిదే ఆగే పరిస్థితి లేదు.

పట్టణ ప్రాంతాల్లో నెలకొన్న ఫ్యాక్టరీలలో నిపుణత, అర్థ నిపుణత కార్మికులుగా కూడా వీరు పని చేస్తుంటారు. కానీ పురుష కార్మికులతో పోల్చినపుడు చాలా తక్కువ వేతనాలు లభిస్తున్నాయి. ఇంట్లో చేసే పనిని అనుత్పాదక శ్రమగా చూసి దానికి ఎటువంటి విలువా కట్టడంలేదు. భారత దేశంలో స్థిర (కదిలించటానికి వీలులేని) ఆస్తులలో 1శాతం లోపు మాత్రమే మహిళల పేర నమోదు అయివున్నట్లు మన ప్రభుత్వ రికార్డులే చెబుతున్నాయి. ఇదీ ఈ దేశంలో మహిళల ఆర్థిక స్వాతంత్రం.

**ఆరోగ్యము, విద్య:-**

మన సమాజంలో స్త్రీ విద్య ఎప్పుడూ ద్వితీయ ప్రాధాన్యత క్రిందనే ఉంటోంది. స్త్రీ విద్య, అక్షరాస్యత శాతం పెంచేందుకు గత కొంతకాలంగా చేసిన ప్రయత్నం వల్ల మహిళలు బ్యూరోక్రసిలోను, ఇతర ఉపాధి రంగాల్లోనూ ఉన్నత స్థానాలకు ఎదుగుతున్నారు. మన మహిళా పైలట్లను, అంతరిక్ష శాస్త్రవేత్తలను కలిగి ఉన్నాం. అదే సమయంలో మహిళా సాధికారితలో అనేక వైరుధ్యాలు అలానే వున్నాయి. చాలా రంగాల్లో కొన్ని తరగతులకు చెందిన మహిళలు, పురుషులతో సమంగా పోటీ పడుతున్నారు. దళితులు, గిరిజనులు ఇతర వెనుకబడిన తరగతులు, మైనారిటీలు వంటి అట్టడుగు వర్గాలకు చెందిన మహిళలు ఇప్పటికీ అంధకారంలోనే మగ్గుతున్నారు. వారికి ఎలాంటి హక్కులు, రక్షణలు గానీ లేవు. ఈ తరగతులకు చెందిన మహిళలు సమాజ అభివృద్ధికి అందిస్తున్న సేవలు అపారమైనవి. అయినా సమాజం చేత వీరు ఇప్పటికీ బహిష్కృతులుగానే ఉంటున్నారు. వీరిలో అక్షరాస్యత శాతం చాలా తక్కువ. ఆరోగ్యం, పారిశుద్యం సదుపాయాలు వీరి దరిదాపులకు చేరటం లేదు. వీరి విద్య అభ్యున్నతి కోసం ప్రభుత్వం గ్రామీణాభివృద్ధి శాఖ అధ్వర్యంలో కొన్ని కార్యక్రమాలను చేపట్టింది. వాటిలో డ్వాక్రా తదితర పతకాలు ఉన్నాయి. గ్రామీణ పేద మహిళలకు ఆర్థిక సాధికారత కల్పించేందుకు ఉద్దేశించినవే ఈ పథకాలు అని ప్రభుత్వం చెప్పింది. కానీ, ఈ పథకాల అమలులో ఎలాంటి పారదర్శకత కనిపించటం లేదు. గ్రామీణ ప్రాంతాల అట్టడుగు వర్గాలకు చెందిన పేద మహిళలు ఇప్పటికీ బ్రోకర్లు, మధ్యవర్తుల చేతిలో దోపిడీకి గురవుతూనే ఉన్నారు. మన కుటుంబాలు పితృస్వామిక వ్యవస్థలో ఉన్నాయి. అందువల్లే మహిళల ఆరోగ్యం ద్వితీయ శ్రేణి అంశంగానే చూడబడుతోంది.

ఈ సామాజిక దుస్థితి వల్ల మహిళలు ఆసుపత్రులకు వెళ్ళి వైద్యం చేయించుకునే అలవాటు కూడా లేకుండా ఉంది. గ్రామీణ ప్రాంతాల్లో వైద్య సౌకర్యాలు సరిగా లేకపోవడంవల్ల కూడా వీరు ఆరోగ్యపరంగా అనేక ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. పోషకాహారలేమి, అధ్యాన్నమైన పారిశుద్యం, పరిసరాలు వల్ల గ్రామీణ మహిళలు తరచు వ్యాధులకు గురవుతున్నారు. క్యాన్సర్ లాంటి భయంకర వ్యాధులు కూడా ప్రబలుతున్నాయి. గ్రామీణ ప్రాంతాల్లో సరైన వైద్యం లేకపోవటంవల్ల హిస్టరెక్టమీ ఆపరేషన్లు చేయించుకోవటానికి మహిళలు వెనకాడుతున్నారు.

స్త్రీ పురుష వివక్షత కొన్ని కుటుంబాల్లో కొనసాగుతున్నందున ఆడపిల్లలకు సరైన పోషకాహారం లభించటం లేదు. మహిళల పట్ల ఉన్న ఈ ధోరణిలో మార్పు వస్తుంది. తల్లిదండ్రులు, చిన్న, చింతలేని కుటుంబాలకు ప్రాధాన్యం ఇస్తున్నాయి. మహిళల ఆరోగ్యం పట్ల వివక్షతో కూడా మార్పులు చోటుచేసుకున్నాయి.

**పేదరికం:-** కరువు కాలకాల వలన రాయలసీమలాంటి ప్రాంతాల్లో గ్రామీణ పేదలు కూటి కోసం, కూలి కోసం తమ గ్రామాలను విడిచి వలన బాటవడుతున్నారు. ఈ క్రమంలో వృద్ధులను, పిల్లలను ఇంటివద్దనే విడిచి వెళుతున్నారు. ఈ పరిస్థితుల్లో పేద బాలికలు అక్రమ రవాణా(ట్రాఫికింగ్)కు గురవుతున్నారు. సెక్స్ వర్కర్లుగా మార్చబడుతున్నారు. వలన వెళ్ళే కుటుంబాల్లో మహిళా కూలీలు కూడా వుంటారు. పని ప్రదేశాల్లో వీరు ఇతరులచే లైంగిక దోపిడీకి, దూషణలకు గురవుతుంటారు. ఉత్తరాంధ్రలో మహిళలు అనేక రకాల సమస్యలను ఎదుర్కొంటున్నారు. ఇందులో ఒకటి ప్రాంతీయ అస్తిత్వ సమస్య. మత్స్య కార్మిక, ఇతర అణగారిన వర్గాలకు చెందిన మహిళలు, వారి యజమానులు, కాంట్రాక్టర్ల చేతిలో లైంగిక దోపిడిక గురవుతుంటారు. ఈ ప్రాంతానికి చెందిన పేద మహిళలు ఇప్పటికీ బ్లౌజులు(జాకెట్లు) ధరించరు. వీరిలో పొగ(చుట్ట) త్రాగే అలవాటు ఉంటుంది. దీనివల్ల ఈ మహిళలు వ్యాధులకు గురవుతుంటారు. ఉత్తరాంధ్రలో ఇటీవల కాలంలో గిరిజన మహిళలపై పోలీసులు అకృత్యాలు కూడా చోటు చేసుకున్నాయి. అటవీ ప్రాంతంలోని గిరిజనులను నక్సలైట్లుగా ముద్రవేసి పోలీసులు వారి ఇళ్ళపై దాడి చేసి మహిళలను చెరుస్తున్నారు అనటానికి వాకపల్లి, భల్లుగూడ సంఘటనలు ఒక నిదర్శనం. మన సమాజంలో గిరిజన మహిళల ప్రాణాలకు భద్రత కరువైందనటానికి ఈ ఉదంతాలే తిరుగులేని తార్కాణాలు.

**మహిళలు- అభివృద్ధి:-**

కోస్తా ఆంధ్రకు చెందిన మహిళలు అభివృద్ధిలో కొంత ముందుంటారు. వారు స్వయం సహాయక బృందాల్లో పాల్గొంటున్నారు. ఆదాయ సముపార్జనకై కొత్తకొత్త కార్యక్రమాలు చేపడుతున్నారు. దీంతో వీరు వ్యవసాయ రంగంపై ఆధారపడే పరిస్థితి తగ్గింది. కార్పొరేట్, సేవలు ఇతర అసంఘటిత రంగాల్లో కొత్త పనులకోసం మహిళలు వెతుకుతున్నారు. గ్రామీణ మహిళలు పచ్చళ్ళు తయారీ, ఆటబొమ్మల తయారీ, అద్దకాలు తదితర పనులకు సంబంధించిన కుటీర పరిశ్రమలను నెలకొల్పుతున్నారు. తద్వారా కొంత ఆదాయాన్ని సంపాదిస్తున్నారు. వారికి బ్యాంకుల నుంచి, ప్రభుత్వం నుంచి రుణాలు, ఇతర ఆర్థిక సహాయం అవసరమవుతుంది.

**సాంఘిక దురాచారాలు:-** మన సమాజంలో నెలకొన్న కుల వ్యవస్థ, మూఢాచారాలు మహిళలపై ప్రత్యేకించి రాయలసీమ వంటి వెనుకబడిన ప్రాంతంలోని అట్టడుగు వర్గంలోని మహిళలపై తీవ్ర ప్రభావం చూపుతుంది. బసివి, మాతంగి వంటి మూఢాచారాల పేరుతో మహిళలపై లైంగిక దోపిడి సాగిస్తున్నారు. ఆడపిల్లలను చిన్నపుడే గ్రామ దేవతలకు అంకితమిస్తున్నారు. వీరు అవివాహితులుగానే జీవితాంతం ఉండి పోవలసి వస్తుంది. వీరు ఆ వూరి పెద్దలకు, భక్తులకు సేవకులుగా సపరిచర్యలు చేయాల్సి వస్తుంది. సంస్కరణ ఉద్యమాలు ఈ ప్రాంతంలో చేపడుతున్నప్పటికీ ఈ మూఢాచారాల్ని విడనాడటానికి వారి తల్లిదండ్రులు నిరాకరిస్తున్నారు. భూస్వామ్య పెత్తందారీతనమే ఈ సాంఘిక దురాచారాలకు ప్రధాన కారణం.

**రాజకీయ రంగం:-**

సీమాంధ్ర మహిళల్లో రాజకీయ చైతన్యం ఎక్కువ. రాజకీయాధికారం గురించి వీరికి మంచి అవగాహనే ఉంది. స్వాతంత్రోద్యమ కాలం నుంచే ఈ ప్రాంత మహిళలు ప్రధాన రాజకీయ స్రవంతిలో ప్రత్యామ్నాయ రాజకీయాలలో చురుకైన పాత్రవహిస్తూ వస్తున్నారు. స్థానిక సంస్థల్లో రిజర్వేషన్లు మహిళల్లో రాజకీయ చైతన్యాన్ని తీసుకురావటానికి మరింత దోహదపడ్డాయి. అయితే ఈ మహిళల అధికారాన్ని తెర వెనుక నుంచి మగవారే (భర్త) శాసిస్తున్నారన్న విమర్శలు అక్కడక్కడా వినబడుతున్నాయి. అగ్ర వర్ణాలకు చెందిన మహిళలనే కాదు ఎస్.సి., ఎస్.టి. కుటుంబాల్లో కూడా మహిళల అధికారాన్ని ఆ కుటుంబ యజమానే చలాయిస్తున్న దాఖలాలు ఉన్నాయి.

**చేపట్టాల్సిన చర్యలు:-** పరిశేష ఆంధ్ర ప్రదేశ్‌లో మహిళల స్థితి విద్య, ఉపాధి రంగాలలో కొంత పర్వాలేదని అనిపిస్తున్నా ఇప్పటికీ వీటిలో అంతరాలు గణనీయంగానే ఉన్నాయి. వాటిని పూడ్చేందుకు రాష్ట్ర ప్రభుత్వం రాయలసీమ, ఉత్తరాంధ్ర వంటి అత్యంత వెనుబడిన ప్రాంతాల్లో మహిళాభివృద్ధికి అధిక ప్రాధాన్యం ఇవ్వాలి. ఈ వెనుకబడిన ప్రాంతాల్లో మహిళల అక్షరాస్యత శాతాన్ని, ఆరోగ్య సదుపాయాలను పెంచాలి. బడి నుంచి అర్థంతరంగా చదువు మానేసే ఆడపిల్లల సంఖ్య బలహీన వర్గాల కుటుంబాల్లోనే ఎక్కువగా ఉంటోంది. బాలికల డ్రాపవుట్లను తగ్గించేందుకు "మళ్ళీ బడి" వంటి పథకాలను ప్రభుత్వం చిత్తశుద్ధితో అమలు చేయాలి. ఆ ప్రాంతాల విద్యార్థులకు విద్యా పరంగా ప్రోత్సాహకాలు ఇవ్వాలి. చదువు ప్రాధాన్యత గురించి వారి తల్లిదండ్రులకు అవగాహన కల్పించేందుకు కృషి చేయాలి. వాలికల కోసం ప్రభుత్వం కొన్ని ప్రత్యేక విద్యా సంస్థలకు నెలకొల్పాలి. అదే సమయంలో మహిళలకు తగినంత ఉపాధి అవకాశాలు చూపించాలి. మధ్య కోస్తా ఆంధ్రకుచెందిన మహిళలు సహజంగానే చదువు విషయంలోను, ఇతర విషయాల్లోను డైనమిక్‌గా వుంటారు. ప్రభుత్వం వీరిని పారిశ్రామికవేత్తలుగా, పాలనా దక్షులుగా

తరువాయి 30వ పేజీలో

# డ్వాక్రాలో అవినీతిపై ఐద్వా పోరాటం



తిరుపతి (మెప్మా) పరిధిలో మొత్తం దాదాపు 2400 సంఘాలు, 111 సమైఖ్యలు, దాదాపు 29 వేల మహిళలు సభ్యులుగా వున్నారు. ఇన్నీ వేల మంది మహిళలు పొదుపు సంఘంలో సభ్యులుగా వుంటూ ప్రతి నెల కొంత పొదుపు చేసుకొంటూ బ్యాంకు ద్వారా వడ్డీ లేని ఋణాలు పొందుతూ తమ కుటుంబ అవసరాలకు వినియోగించుకుంటున్నారు. ఇన్నీ వేల మంది మహిళలకు ఉపయోగకరంగా వున్న ఈ పొదుపు సంఘాల్లో అవినీతి కూడ తారా స్థాయిలో జరుగుతున్నది.

**ఐద్వా వెలుగులోకి తెచ్చిన సమస్యలు:**

**యానాది కాలనీలో సమస్యలు:**

1. టిఎంసి కాలనిలో 15 సంఘాలున్నాయి. ఈ కాలనీలో మొత్తం మున్సిపల్ కార్యాలయంలో చెత్త పెరుకొని, కాలువలెత్తె కాంట్రాక్టు వర్కర్స్‌గా పని చేస్తున్న ఎస్.సి, ఎస్.టిలు వున్నారు. వీరందరు పొదుపు సంఘాలతో కలిసి సమాఖ్యని ఏర్పాటు చేసుకొన్నారు. వీరి చదువు రాని తనాన్ని ఆసరాగా చేసుకొని ఆర్‌పి రాధ బ్యాంకులో జమచేయమని ఇచ్చిన పొదుపు, సమాఖ్య పొదుపుల మొత్తాన్ని బ్యాంకులో జమ చేయకుండా దాదాపు 27 లక్షలు స్వాహా చేసింది.
2. బైరాగపట్టెడ, ఎంఆర్‌పల్లి: మహాత్మా గాంధీ సమాఖ్య మహిమా సంఘం బుక్ కీపర్ పుష్పలత బ్యాంకులో జమ చేస్తానని పొదుపు తీసుకెళ్ళి బ్యాంకు దొంగ స్టాంపు తయారు చేసుకొని రిసిప్ట్ చూపించి 3 లక్షలు స్వాహా చేసింది.
3. యశోదానగర్ పద్మావతి ఫెడరేషన్‌లో 28 సంఘాలుంటే ఆర్‌పి లక్ష్మి 5 సంఘాల పొదుపు బ్యాంకులలో జమ చేస్తానని చెప్పి దొంగ స్టాంపు తయారు చేసుకొని బ్యాంకులో జమ చేయకుండా 7 లక్షలు స్వాహా చేసింది. ఈ సమస్యల్ని ఐద్వా జిల్లా కమిటి వెలుగులోకి తెచ్చి అధికారుల దృష్టికి పదే పదే తీసుకెళ్ళినా తిరుపతి ప్రాజెక్టు అధికారి రెడ్డికుమారి దోషుల్ని వెనకేసుకొచ్చింది. అనంతరం ఐద్వా ప్రత్యక్ష కార్యాచరణకు పూనుకొంది.

**అవినీతిపై ఐద్వా చేసిన పోరాటాలు:**

1. బాధితులతో మున్సిపల్ కార్యాలయం ముట్టడించాము. 100 మంది బాధితులతో సదస్సు పెట్టి ఎంఎల్‌సి గారు పాల్గొన్నారు. దీనితో అధికారుల్ని సస్పెండ్ చేయాలని డిమాండ్ తీసుకొన్నాము. అనంతరం పిడి గారి దృష్టికి, కమీషనర్ దృష్టికితీసుకెళ్లాము. స్పందించిన అధికారులు వెంటనే ఈ సమాఖ్యల్లో విచారణ కమిటిని ఏర్పాటు చేసి మాజీ పిడి గారి ఆధ్వర్యంలో విచారణ చేసారు. దీనికి బాధ్యులైన అధికార్లు ప్రాజెక్టు ఆఫీసర్ రెడ్డి కుమారిని, సి.ఓ.విష్ణులను సస్పెండ్ చేసారు. తిరుపతిలోని అన్నీ సంఘాల, సమాఖ్యల పట్టణ సమాఖ్య లీడర్లను వెంటనే మార్చారు.

**ఐద్వా సాధించిన విజయాలు:**

1. బాధిత మహిళలకు డబ్బులు ఇప్పించాము. యశోదానగర్ పద్మావతి ఫెడరేషన్‌లో 7 లక్షలకు ఆర్‌పి లక్ష్మి ద్వారా అధికారుల సమక్షంలో బాండు పేపర్స్‌పై 3 నెలల లోపు చెల్లిస్తానని రాయించాము. టిఎంసి కాలనీలో విచారణ పూర్తి చేసి ఆర్‌పి రాధపై మెప్మా అధికారులు 18 లక్షలు స్వాహా చేసినట్లు నిర్ధారించి కేసు పెట్టారు. పట్టణ సమాఖ్యలో వాటర్ వర్కర్స్ జీతాల కోసం వెచ్చించిన మొత్తంలో 5 లక్షల రూపాయలు వేస్తే అందులో పట్టణ కమిటి ఆఫీస్‌బేరర్స్ అవినీతికి పాల్పడ్డారు. మన పోరాటం అనంతరం జిల్లాలో అనేక ప్రాంతాల్లో సమస్యలు వెలుగులోకి వస్తున్నాయి. పీలేరులో సంఘమిత్ర లక్ష రూపాయలు స్వాహా చేసింది.
2. శ్రీకాళహస్తి తొట్టంబేడులో సంఘమిత్ర లక్ష స్వాహా చేసినట్లు వార్తలొచ్చాయి.
3. కుప్పంలో బ్యాంకు మేనేజర్ 13 గ్రామాల సభ్యుల పేరుతో 57 లక్షలు స్వాహా చేసినట్లు వార్తలొచ్చాయి. వీటిపై కూడా పోరాటానికి ఐద్వా సిద్ధమౌతున్నది.

అవగాహన పత్రం





# బాల నేరస్తుల చట్టంలో మార్పులు చెయ్యాలా?

-ఐద్వా

బాల నేరస్తులను శిక్షించే చట్టం సవరించబడేందుకు సిద్ధం అవుతున్నది. ఇపుడు చట్ట ప్రకారం 18ఏళ్ల వరకు నేరం చేసిన పిల్లలను బాలనేరస్తులుగా పరిగణించి వారికి సంబంధించిన చట్టాల ప్రకారమే శిక్ష పడుతున్నది. ఇప్పుడా వయసును 16 ఏళ్లకు తగ్గించాలని ప్రతిపాదన 16ఏళ్ల వయసు దాటినా వారిపై హత్యా నేరం మోపబడి ఉంటే 302, సెక్షన్ క్రింద, యాసిడ్ దాడుల అభియోగం ఉంటే 326 క్రింద, అత్యాచారం నేరం అభియోగాలు ఎదుర్కొంటున్న వారిని ఐ.పి సెక్షన్ 376, 376ఎ, 376డి క్రింద, సాధారణ న్యాయస్థానాలలో విచారణ జరిపి శిక్షించాలన్న ప్రతిపాదన ఉంది. దీనిని బాలల హక్కుల పై కృషి చేస్తున్న వారంతా తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. ఈ సవరణతో చిన్న పిల్లలను కూడా పెద్ద పెద్ద నేరాలు చేసే సాధారణ ఖైదీలతో బంధించవలసి వుంటుంది. అందువలన పిల్లలు పెద్ద నేరస్తుల ప్రభావాలకు లోనయ్యే అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. పిల్లలు నేరాలు చేయడం ఆపేందుకు తీవ్రమయిన ప్రయత్నం చేయాల్సిందే కానీ వీరి వయసును తగ్గించడం వలన వారు చేసే నేరాలను తగ్గించే అవకాశాలు ఎక్కువ ఉండవని మనం గుర్తించాలి. ఈ ప్రయత్నం మరో వెనకడుగు మాత్రమే అవుతుంది.

ఇప్పుడున్న బాలల న్యాయ చట్టం పరిధిలోనే పిల్లలు తిరిగి అదే నేరం చేయకుండా ఉండేందుకు తగిన చర్యలు తీసుకునే వీలు కల్పించాలి. అందులో భాగంగా ఇప్పుడు అత్యధిక శిక్షని 3ఏళ్ల నుండి పెంచవచ్చు. ఎన్నేళ్ల వరకు పెంచితే బాగుంటుందన్నది అందరూ కూర్చుని ఆలోచించవచ్చు. పిల్లలను సంరక్షకుల అధీనంలో ఉండే కాలాని పెంచవచ్చు.

పిల్లలను కూడా పెద్దలతో సరిసమానంగా శిక్షించడం వలన వారు మంచి మార్గంలోకి రాకపోగా మరింత కసితో చెడ్డ పనులు చేయడానికి అలవాటు పడే అవకాశం వుంది. ఇప్పటికే వారు ఉన్న చట్టం క్రింద శిక్ష అనుభవించి ఉన్నందువలన చట్టంపై మరింత తగ్గే అవకాశం ఉంది. అమెరికాలోని ఎన్నో పరిశోధనలు ఈ విషయాన్నే రుజువు చేసాయి.

కొంతమంది పిల్లలు వయసులో చిన్నవారైనా, మానసికంగా ఎదిగి ఉంటారన్నది ఈ చట్టం సవరణ ప్రతిపాదనకు మరో కారణం. అంతేకాదు, వారు చేసిన పనులు, వాటి పర్యవసానాలు బాగా తెలుసుకుని, అర్థం చేసుకున్నారన్నది సవరణను సమర్థించడానికి ఒక కారణం.

కానీ చిత్తుప్రతి అధ్యయనాలు ఇందుకు భిన్నంగా ఉన్నాయి. పిల్లలే పెద్దలకన్న ఎక్కువగా తోటి పిల్లల ప్రభావాలకు లోనవుతారని, ఫలితాలను అంచనా వేయలేరని, విపత్తుల గురించిన సరైన అవగాహన ఉండదని, అందువలన తెలివితక్కువ నిర్ణయాలు తీసుకుంటారని తెలియజేస్తున్నాయి. పిల్లల చట్టంలోని బిల్లు వీటన్నింటిని గుర్తించినప్పటికీ, కేంద్ర కేబినెట్ పిల్లల న్యాయ చట్ట సవరణ 2014 ఆమోదించింది.... పిల్లల మానసిక పరిపక్వతను అంచనా వేసేందుకు బోర్డుకు అనుమతి ఇవ్వడం, బోర్డు నేరం మోపబడిన పిల్ల/పిల్లవాడికి నేరం పరిణామాలు తెలుసా, లేదా మొ॥ అంశాలు నిర్ణయించాలి. దీనివలన బోర్డు ఎప్పుడూ సరైన నిర్ణయమే తీసుకుంటుంది..... నమ్మలేకుండా ఉంది. ఎందుకంటే ఒక్కొక్క సారి నేరం యొక్క క్రూరత్వం బోర్డ్ నిర్ణయం ప్రభావితం చేసే అవకాశాలు ఉన్నాయి.

అంటే నేరాలను చేసినవారిని అలాగే వదిలేయాలని కాదు. బాలల నేరాలు రోజు రోజుకి పెరిగిపోతున్నాయని చెపుతున్న ప్రభుత్వం వాదన తప్పు ఎన్‌సిఆర్‌బి గణాంకాల ప్రకారం 2013లో బాల నేరస్తుల శాతం గత కొద్ది సంవత్సరాలు లాగే మొత్తం నేరాలు 1.20%గానే ఉంది. ఇందులోనూ దొంగతనాలు, దెబ్బలాటలు,

దోపిడీలు ఉన్నాయి. .... 1007 హత్య నేరాలు, 1884 అత్యాచార నేరాలు బాలలపై మోపబడ్డాయి. అందులో నుండి 18 వయసులో ఉన్న బాలురపై మోపబడ్డవి 4.10% మాత్రమే అత్యాచార నేరంపై ఖైదు చేయడ్డారు. 2013లో అత్యాచార నేరం క్రింద 1388 మంది 16 నుంచి 18ఏళ్ల వయసులో వారు అరెస్ట్ చేయబడగా, పెద్దవారు 33,707 మంది అత్యాచార నేరంపై అరెస్టు చేయబడ్డారు. ఇందులోనూ కొన్ని ఇద్దరూ ఇష్టపడి సంభోగంలో పాల్గొన్న సందర్భాలు ఉన్నాయి. ఐద్వా పరిశోధనల ప్రకారం కొంతమంది పిల్లలు ఐచ్చికంగా సంభోగంలో పాల్గొన్నప్పటికీ, ఆడపిల్లల తల్లి తండ్రులు మగపిల్లలపై అత్యాచార నేరం మోపడం జరుగుతున్నది. పెద్దల అనుమతి లేనందువలన వారిపై కక్ష తీర్చుకునేందుకు కొందరు పెద్దలు ఇలా చేస్తున్నారు. అందువలననే క్రితం ప్రభుత్వాన్ని కూడా ఇష్టపడి సంపర్కంలో పాల్గొనే వయసును 16 సం॥లకు తగ్గించమని వేము సూచించాము. నిజానికి ఈ సంభోగం పరిమిత వయసును 18గా ఉన్నా అబ్బాయిలను అత్యాచార నేరం క్రింద అరెస్టు చేసే అవకాశాలున్నాయి.

ఇంకో ముఖ్యమైన విషయం ఏమిటంటే, ఈ నేరాలు చేసిన బాలలు ఎ....ంతమంది అతి తక్కువ ఆదాయం ఉన్న కుటుంబాల నుండి వచ్చిన వారే. 50.20% మంది బాల నేరస్తులు పేదవారు. వారి వార్షిక ఆదాయం రూ॥ 25,000ల కంటే తక్కువే. 27% వార్షిక ఆదాయం రూ॥ 25,000/-నుండి రూ॥ 50,000/-లోపే. 20.20%మంది కుటుంబాలు వార్షిక ఆదాయం రూ 50,000/-నుండి 2,00,000/-అంటే చాలామందికి ఎటువంటి చదువు సంస్కారం నేర్చుకునే అవకాశాలే లేవన్నమాట. వారిని మరింత పాశవికంగా శిక్షించడం అన్యాయం కదా!

అందువలన బాలల చట్టానికి చేసేందుకు సూచించబడిన ఈ సవరణను ఐద్వా మానవ హక్కుల ఉల్లంఘనగా భావిస్తున్నది. ఇది ప్రజల రక్షణకు గానీ, బాలలను తీర్చిదిద్దడంలో గానీ ఉపయోగపడదని భావిస్తున్నది. ఈ లక్ష్యాలు సాధించాలంటే మనం చెప్పుకున్నట్లు బాలల శిక్షా స్మృతి చట్టం మరింత పటిష్టం చేయాలి. పిల్లలు మళ్లీ నేరస్థులుగా తయారవకుండా, సమాజానికి ప్రమాదకరంగా మారకుండా ఉండడానికి అనువయిన మార్పులు చేయాలి. ఇది మరింత ఎక్కువగా వారికి సలహాలను ఇవ్వడం వలన... రక్షక గృహాలలో మరిన్ని ఎక్కువ రోజులు ఉంచడం వలన సాధ్యవడే అవకాశం ఉంది. ఇప్పుడున్న చట్టం సెక్షన్ 15(11) ప్రకారం నేరం చేసిన బాలలు బోర్డు, వారికి భద్రంగా ఉంటుందని అభిప్రాయ పడిన చోట, వారికీ మంచిదని అభిప్రాయ పడిన చోట పెట్టవచ్చు. అందువలన 3సం॥ల తర్వాత బయటకు వచ్చిన తరువాత కూడా మళ్లీ నేరాలకు పాల్పడుతున్నారు. అంటే వారిని మార్చడానికి 3 ఏళ్ళు సరిపోలేదన్నమాట. అందుకని ఈ కాలాన్ని పెంచి వారిని సన్మార్గంలో పెట్టే ప్రయత్నం ప్రభుత్వం చేయాలని ఐద్వా భావిస్తున్నది. ఇటువంటి ప్రత్యామ్నాయ మార్గాలను పరిశీలించి చట్టాన్ని తగిన విధంగా సవరించాలి.

**(బాల నేరస్థుల వయసు తగ్గింపుపై ఐద్వా కేంద్ర కమిటి అభిప్రాయం నోట్)**

---

**27వ పేజీ తరువాయి**

ఎదిగేందుకు అవసరమైన చర్యలు చేపట్టాలి. అన్ని రంగాల్లో రాణించేలా కొన్ని పథకాలు ప్రవేశపెట్టాలి. సమాజ అభ్యున్నతికి వీరి సేవలను వినియోగించుకోవాలి. పాలనా రంగంలో మహిళల ప్రాతినిధ్యం తగినంతగా లేదు. ప్రజా జీవితంలో కూడా వీరి నాయకత్వం నామమాత్రంగానే ఉంది. విధాన నిర్ణాయక ప్రక్రియలో వీరికి చోటులేదు. నాయకత్వంలో మహిళల పాత్ర పెంచేందుకు ప్రభుత్వం అధిక ప్రాధాన్యత ఇవ్వాలి. ఇందుకునుగుణంగా నిర్ధిష్ట ప్రణాళికలు చేపట్టాలి.

ప్రతి గ్రామానికి ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రం, స్థానికంగా డాక్టర్ ఉండేలా చూడాలి. మందులు, ఇతర ఉపకరణాలు సమకూర్చాలి. పనిచేసే చోటే డాక్టర్లు ఉండేలా ప్రజారోగ్య శాఖ చూడాలి. చాలా గ్రామాల్లో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు నిస్తేజంగా పడివున్నాయి. డాక్టరు వుంటే మందులు ఉండవు, మందులు ఉంటే డాక్టరు ఉండరు. ప్రభుత్వం, ఇరత ప్రభుత్వ రంగ సంస్థలు గ్రామీణ ప్రాంతాల్లోని మహిళలకు పరిశుభ్రత, ఆరోగ్య పరిరక్షణ ప్రాధాన్యత గురించి వివరించేందుకు ప్రచార కార్యక్రమాలు నిర్వహించాలి. ప్రభుత్వ రంగంలో ఇటీవల కాలంలో మహిళా ఉద్యోగినులకు భద్రత ఒక పెద్ద సవాలుగా తయారైంది. మహిళల పట్ల లైంగిక వేధింపులు, దూషణలు, హింస వంటివి చోటు చేసుకోవటం ఆందోళన కలిగిస్తున్నాయి. పురుష దురహంకారం నుంచి, అరాచక వాదుల నుంచి మహిళలను బాలికలను కాపాడేందుకు శాంతి భద్రతల వ్యవస్థను తీర్చి దిద్దాలి. ప్రతి కాలేజి, హాస్టల్ సమీపంలో పోలీస్ స్టేషన్‌ను నెలకొల్పాలి. మహిళల పట్ల ర్యాగింగ్ ఇతర నేరాలకు పాల్పడే వారిని, ఈవ్ టీజర్స్‌ను పట్టుకుని కఠినంగా శిక్షించాలి. లైంగికపరమైన, కులపరమైన వివక్షను రూపుమాపేందుకు రాజకీయ జోక్యం అవసరం.

అట్టడుగు వర్గాలకు చెందిన మహిళలు ఆత్మ గౌరవంతో హుందాగా జీవించేందుకు గాను ప్రభుత్వం కొన్ని అదనపు రక్షణలు ఏర్పాటు చేయాలి. మత ఘర్షణలు, హింస నుంచి మైనారిటీ సెక్షన్‌లకు చెందిన మహిళలకు రక్షణ కల్పించాలి.

**(రచయిత సెంటర్ ఫర్ వుమన్ స్టడీస్ డైరెక్టర్, నాగార్జున విశ్వ విద్యాలయం)**

సమానత

# ఆచరిద్దాం...

- కృష్ణారావు చనుమోలు

**మగవారు తమ జీవిత భాగస్వామిని/మహిళలను పిలిచే తీరు అనేక శబ్దాలలో వ్యక్తమవుతుంటుంది. ఏయ్, ఓయ్.. నిన్నే..., హలో, ఇదిగో... ఏమేవ్...! వినిపిస్తుందా (ఇంతకుముందే పిలిచినట్లు) అంటూ పిలవటం వింటుంటాం. మహిళలు తమ జీవిత భాగస్వాములు/మగవారిని పిలిచే తీరు ఎప్పుడూ కొత్తవారిని పలకరించినట్లే అన్పిస్తుంది. ఏమండీ..., ఇదిగో... మిమ్మల్నే.న.. లేదా మీ నాన్నను పిలువు అంటూ పిల్లలకు చెప్పటం (వీరి మధ్య మాటలేలేనట్లు) బాగా చనువు వున్నవారు ఏమయ్యోయ్... నిన్నే అని కూడా అనటం వింటుంటాం.**

ప్రస్తుత సామాజిక వ్యవస్థలో వివక్షత వలన మహిళల్లో ఆత్మన్యూనత వుంటుంది. స్వేచ్ఛ - స్వాతంత్ర్యం పుట్టినింట్లోనూ లేకపోవటం చూస్తుంటాం. ఆర్థికంగా తన కాళ్లపై తాను నిలబడగలిగే అవసరమైన వనరులు కరువవుతుంటాయి. మత సాంప్రదాయాలు, పురాణ కథలు, ప్రచార సాధనాల ప్రభావంతోనూ మహిళలు మౌనంగా బాధలు భరించే స్థితి ఏర్పడటం తెలిసిందే. ఇంటిపని, బాధ్యతల పేరుతో గొడ్డుచాకిరీతో వారి శక్తంతా హరించుకుపోతుంది.

ఈ పద్ధతి చక్కగా ఇలాగే కొనసాగటానికి ఇల్లాలే ఈ జగతికి జీవనజ్యోతి అంటూ మహిళలు ఉబ్బిపోయేలా వారి పాత్రను పొగుడుతుంటారు. మాటల్లోనూ, పాటల్లోనూ, కథల్లోనూ కీర్తిస్తుంటారు. అభ్యుదయవాదులు కూడా కుటుంబంలో మహిళల పాత్రను గుర్తిస్తారు, ప్రశంసిస్తారు. అంతవరకే పరిమితమైతే అర్థం చేసుకున్న వారికి, లేని వారికి తేడా ఏముంటుంది? సమాజంలో స్త్రీ పురుషులిద్దరూ సమానులేనని సైద్ధాంతికంగా అంగీకరించినా, ఆచరణలో సహకరించటం, వారితో భాగం పంచుకోవటంలో లోపం కనిపిస్తుంది. ఇంటిలో పనులేమైనా శ్రమగానే భావించి పంచుకోవాలి. గదా! కొన్ని పనులకే సహకరించి కొన్ని పనులు పూర్తిగా మహిళలకే వదిలి వేయటమంటే ఆచరణలో పురుషాధిక్యతా ధోరణిని కొనసాగించటమే! రోజూ సహకరించటం, భాగం పంచుకోవటం సాధ్యం కాకపోవచ్చు. అవసరం, అవకాశాన్ని బట్టి సహకరించటం అలవాటుగా మారాలి. దినచర్యలో భాగం కావాలి. ఆచరణలో ఇచ్చే సహకారం జీవిత భాగస్వామి పట్ల విశ్వాసాన్ని నమ్మకాన్ని పెంచుతుంది. దీనిని ఇతర ఏ చర్యలతోనూ పోల్చలేం.

మగవారు తమ జీవిత భాగస్వామిని/మహిళలను పిలిచే తీరు అనేక శబ్దాలలో వ్యక్తమవుతుంటుంది. ఏయ్, ఓయ్.. నిన్నే..., హలో, ఇదిగో... ఏమేవ్...! వినిపిస్తుందా (ఇంతకుముందే పిలిచినట్లు) అంటూ పిలవటం వింటుంటాం. మహిళలు తమ జీవిత భాగస్వాములు/మగవారిని పిలిచే తీరు ఎప్పుడూ కొత్తవారిని పలకరించినట్లే అన్పిస్తుంది. ఏమండీ..., ఇదిగో... మిమ్మల్నే.న.. లేదా మీ నాన్నను పిలువు అంటూ పిల్లలకు చెప్పటం (వీరి మధ్య మాటలేలేనట్లు) బాగా చనువు వున్నవారు ఏమయ్యోయ్... నిన్నే అని కూడా అనటం వింటుంటాం. ఒక వాస్తవాన్ని కూడా గమనించాలి. పెద్దలు కుదిర్చే పెళ్ళిళ్ళల్లో అమ్మాయి కంటే అబ్బాయి వయస్సు ఎక్కువగా వుండేలా చూడటం జరుగుతుంది. సహజంగానే పిలుపుల్లో పురుషాధిక్యతకు అవకాశం ఏర్పడుతున్నది. ప్రేమించి పెళ్ళి చేసుకున్న జంటల మధ్య పిలుపుల్లో ఆధిపత్య ధోరణి చాలా తక్కువగా కన్పిస్తుంది.

పరిమితకాలం కలసివుండే సహచరులను ,స్నేహితులనే పేర్లతో పిలుస్తుంటాం. రోజూ జీవితాంతం కలిసుండే భార్యాభర్తల బంధం సహచరుల కంటే ఎక్కువ. మానసికంగానే గాక శారీరకంగా కూడా దగ్గరయ్యే ఈ బంధం ఏ స్నేహం కన్నా దగ్గరగా వుండే మధురానుబంధం. నిత్యం పిలుపుల్లోనూ మధురానుభూతిని పొందాల్సిన బంధమే భార్యాభర్తల సంబంధం. కానీ... నేటి పురుషాధిక్య సమాజ ప్రభావం నరనరాల్లోనూ జీర్ణించుకుని వున్నది. కథల్లో, నాటకాల్లో, సినిమాల్లో టీవీ సీరియల్లలో సాహిత్యం, కళలు, మన సంస్కృతి, సాంప్రదాయాలు, మతాచారాల్లో అడుగడుగునా నిత్యం పురుషాధిక్యతను ప్రదర్శిస్తుంటాయి. గుర్తు చేస్తుంటాయి. వాటికి భిన్నంగా వుండటం, తప్పు అన్న భావన కల్గేలా అన్పిస్తాయి.

కుటుంబంలో జరిగే నిర్ణయాలలో జమాఖర్చులు, పిల్లల చదువులు, స్నేహితులు, బంధువులతో సంబంధాలు మొదలగు విషయాలలో జీవిత సహచరిని భాగస్వామిని చేయగల్గితే తోడూ, నీడగా నిలిచినట్లే! ఏడడుగుల సంబంధం జీవిత పర్యంతం తియ్యని బంధంగా కొనసాగినట్లే! మనసున మనసై బ్రతుకున బ్రతుకై తోడుగా వుండే భర్త అడుగుజాడల్లో నడువకుండా వుండగలరా! జీవిత భాగస్వామికి ఇచ్చే విలువ, గౌరవాల ప్రభావం ఇంట్లో పిల్లలపై పడటం సహజం. నేటి పురుషాధిక్య సమాజపు ప్రభావం నుండి పిల్లలను కాపాడుకోగల్గుతాం. ఇంట్లో మహిళలను, ఆడపిల్లలను సమభావంతో చూసే ఆలోచనల పరిమళాలు మనచుట్టు ప్రక్కలా వ్యాపిస్తాయి. వరకట్న దురాచారాలపై ఈ ప్రభావం పడుతుంది. కథలు, కళలు, మీడియా, సాహిత్యాలలో జరిగే పురుషాధిక్య ప్రచారాలను ప్రభావితం చేయకమానదు. స్త్రీ పురుషుల మధ్య అంతరాలు, స్త్రీ పట్ల వివక్షతతో కూడిన నేటి సంస్కృతి మార్పుకు బాటలు వేద్దాం. •

కేస్ స్టడీ

# మాకు న్యాయం కావాలి..

-శాంతిశ్రీ

'చిన్న కుటుంబం చింతలేని కుటుంబం' అన్నట్లు ఒక్క కూతురు చాలు అనుకున్నారా దంపతులు. ఆ బిడ్డను పెంచి పెద్దచేసి, పెళ్లి చేశారు. తీరా అల్లుడు కట్నం డబ్బుల కోసమే చేసుకున్నాడని, పెళ్లికి ముందే ఒక అమ్మాయితో సంబంధం ఉందని తెలిసి వాళ్ల గుండెలు రోదించాయి. పెళ్లయిన తర్వాత ముందు సంబంధం ఉన్న అమ్మాయితోనే సంసారం చేస్తూ, పిల్లల్ని కన్నాడు. ఇదేమి అన్యాయమని ఊరి పెద్దల్ని కలిశారు. తల్లితండ్రులు. పంచాయితీ పెట్టారు పెద్దలు. పంచాయితీలో తప్పు ఒప్పుకుని కట్నం డబ్బులు ఇచ్చేస్తానన్నాడు. అవేవీ ఇవ్వకపోగ తల్లిని ఊళ్లోనే వదిలి, అడ్రస్సు లేకుండా ఆ అమ్మాయిని, పిల్లల్ని తీసుకుని వెళ్లిపోయాడు. పెళ్లి చేసుకున్న అమ్మాయి తల్లిదండ్రులు కోర్టుకు వెళ్లారు. అక్కడా వీరికి న్యాయం జరగలేదు. ఆ భార్యాభర్తలిద్దరూ తమ బిడ్డను వెంటబెట్టుకుని ఐద్వా లీగల్ సెల్‌కు వచ్చారు. వస్తూనే తమ కూతురికి జరిగిన అన్యాయాన్ని తల్లి ఇలా చెప్పుకొచ్చింది.

'మా అమ్మాయి పేరు వెన్నెల. మేము పెద్దగా చదువుకోలేదమ్మా! అయితే చానా పేదవాళ్ళం. అమ్మాయి అయినా అబ్బాయి అయినా ఒక్కళ్లు చాలు అనుకున్నాం. అమ్మాయే పుట్టింది. దాన్ని ఎంతో ప్రేమగా పెంచుకున్నాం. ఇంటర్ వరకూ చదివించి, పెళ్లి చేశాం. ఆ అబ్బాయి కూడా తల్లిదండ్రులకు ఒక్కడే కొడుకు అని, పిల్లను బాగా చూసుకుంటాడనుకున్నాం. తీరా పిల్ల కాపురానికి వెళ్లేసరికి ఇంటి పక్కనోళ్లు అబ్బాయి గురించి నాలుగు రకాలుగా చెప్పడం మొదలు పెట్టారు. మా అమ్మాయి బెంబేలెత్తిపోయి, మాకు ఫోన్ చేసింది. అవన్నీ పట్టించుకోకు బిడ్డా! అబ్బాయి నీతో మంచిగా ఉంటున్నాడు కదా! నువ్వేమీ ఇవన్నీ అబ్బాయిని అడగబోకు' అన్నాం. 'అంతేనంటారా? సరేలే !' అంది మా అమ్మాయి" అని చెప్తుండగా...

బాధ్యులు మీ అమ్మాయిని చెప్పనివ్వండి సమస్య అసలు సమస్యను ఎదుర్కొంది ఆమె కదా!" అన్నారు.

వెన్నెల ఇలా అమ్మాయిని చెప్పనివ్వండి సమస్య. అసలు సమస్యను ఎదుర్కొంది ఆమె కదా!" అన్నారు.

వెన్నెల ఇలా చెప్పుకొచ్చింది... "మా అమ్మానాన్న అలా చెప్పారు. కదా అని నేనేమీ మాట్లాడలేదు. అయితే ఒకరోజు నేను కూరగాయలు కొనడానికని సంతకు వెళ్లి, వస్తోంటే మా ఆయన ఒకల్లింట్లో నుండి బయటకు వస్తున్నాడు. నేను ముందు ఆయనా కాదా? అని కొంచెం జాగ్రత్తగానే పరిశీలించా. ఆయనే ఆ రోజు రాత్రి పని మీద ఊరెళుతున్నానని, వారం పదిరోజులు పట్టచ్చని చెప్పినోడు ఊళ్లోనే ఉన్నాడేంటి? ఈ ఇల్లు ఎవరిది? అని మదనపడుతూ అసలు విషయమేంటో కనుక్కుందామని మా ఆయన కొంచె దూరం వెళ్లే వరకూ ఆగి, ఆ ఇంటికి వెళ్లా. ఆ ఇంట్లో ఒకామె ఆరోనెలో ఐదోనెలో కడుపుతో ఉంది. కొంచెం మంచినీళ్లు ఇమ్మని అడిగి, ఇల్లంతా పరిశీలిస్తే వాళ్లిద్దరూ కలిసి దిగిన పెళ్లిఫొటోలు గోడకు ఉన్నాయి. 'ఆయన ఎవరు?' అని ఆమెను అడిగా. 'మా ఆయన' అని బదులిచ్చింది. నేను షాక్ అయిపోయా. అయినా తేరుకుని, మీకు పెళ్లెప్పుడు అయ్యిందని అడిగా. 'ఏడాది అయ్యింది తొలి కడుపు ఇప్పుడు ఆరో నెల నడుస్తోంది.!' అని చెప్పింది. నా కాళ్లు భూమిలోకి కుంగిపోతున్నట్లు అన్పించింది. అక్కడే ఆయన వచ్చేవరకూ ఉందామనుకున్నా. కానీ ఆ అమ్మాయి ఏమనుకుంటుందో అని ఇంటికి వెళ్లిపోయా! కొంచెం చీకటి పడుతుండగా వాళ్లింటికి వెళ్ళా. తలుపుకొట్టగానే అతడే వచ్చి తీశాడు. నన్నుచూడగానే తలుపు దడేల్‌మని వేసేశాడు. నేను నా బలమంతాఉపయోగించి నెట్టా. నేనలా చేస్తానని ఊహించినట్లు లేదు. తలుపులు తెరుచుకోవటం, ఆయన వెనక్కి పడిపోవడం వెంట వెంటనే జరిగిపోయాయి. 'ఇంతకుముందే పెళ్ళి చేసుకున్నోడివి నన్నెందుకు చేసుకున్నావ్?'అని అడిగా. 'కట్నం డబ్బులుకోసం చేసుకున్నా!' అన్నాడు. 'నేను నీకెట్లా కనిపిస్తున్నా? నా జీవితాన్ని అంతా నాశనం చేశావు'? అని వాడిని చెప్పుతీసుకుని ఆ చెంపా, ఈ చెంపా వాయించా. మా అమ్మానాన్నిని రమ్మంటాను. నీ సంగతి ఏమిటో వాళ్లే కనుక్కొంటారు'అని అక్కడ నుండి ఇంటికి వచ్చేసి మా వాళ్ళకి

**ఊళ్లో పెద్దమనుషుల్ని కలిశారు. పంచాయితీ చేశారు. అక్కడ 'తప్పే అని, ఆ అమ్మాయిని వదిలిపెట్టనని, ఈ అమ్మాయిని చూసుకుంటాను'అని మా ఆయన అన్నాడు, 'నేను అలా ఉండను'అని చెప్పాను. దీంతో ఆమె కట్నం డబ్బులు, ఖర్చుల కింద అయినవన్నీ లెక్కగట్టి ఐదు లక్షలు తిరిగి ఇచ్చేందుకు ఒప్పుకున్నాడు. రెండు నెలలు సమయం అడిగాడు. మా వాళ్లు సరేనని కాగితాలు రాయించుకుని అతనితో, ఊరి పెద్దలతో సంతకాలు చేయించుకున్నారు. నన్ను తీసుకుని వెళ్లిపోయారు. మూడు నెలలు అయినా అతను డబ్బులు ఇవ్వకపోవడంతో మళ్లీ వెళ్లి ఊరి సర్పంచ్‌ని అడిగారు. ఆయన పిలిపించి మాట్లాడితే 'నేను ఇవ్వను, ఏం చేసుకుంటారో చేసుకోండి' అన్నాడు.**

ఫోను చేసి విషయమంతా చెప్పా. తెల్లారేటప్పటికి మా వాళ్లు వచ్చారు. ఊళ్లో పెద్దమనుషుల్ని కలిశారు. పంచాయితీ చేశారు. అక్కడ 'తప్పే అని, ఆ అమ్మాయిని వదిలిపెట్టనని, ఈ అమ్మాయిని చూసుకుంటాను' అని మా ఆయన అన్నాడు, 'నేను అలా ఉండను'అని చెప్పాను. దీంతో ఆమె కట్నం డబ్బులు, ఖర్చుల కింద అయినవన్నీ లెక్కగట్టి ఐదు లక్షలు తిరిగి ఇచ్చేందుకు ఒప్పుకున్నాడు. రెండు నెలలు సమయం అడిగాడు. మా వాళ్లు సరేనని కాగితాలు రాయించుకుని అతనితో, ఊరి పెద్దలతో సంతకాలు చేయించుకున్నారు. నన్ను తీసుకుని వెళ్లిపోయారు. మూడు నెలలు అయినా అతను డబ్బులు ఇవ్వకపోవడంతో మళ్లీ వెళ్లి ఊరి సర్పంచ్‌ని అడిగారు. ఆయన పిలిపించి మాట్లాడితే 'నేను ఇవ్వను, ఏం చేసుకుంటారో చేసుకోండి' అన్నాడు. దీంతో కొందరు పెద్ద మనుషుల సలహాతో మా అమ్మానాన్న పోలీస్‌కేసు పెట్టారు. కోర్టులోకేసు నడుస్తోంది. అయితే వారం క్రితమే వాయిదాఉండాలి. కానీ లాయర్ ఏమీ పంపలేదు. దీంతోమేమే కోర్టుకు వెళ్లి పబ్లిక్ ప్రాసిక్యూటర్‌ని కలిశాం. ఆయన మా కేసు క్లోజ్ అయిపోయింది అంటున్నాడు. మేము ఎటువంటి అంగీకారానికి రాకుండా, మాకేమీ చెప్పకుండా కేసు ఎట్లా క్లోజ్ అవుతుంది.? అని అడిగితే మీరు సంతకం చేశారు అంటున్నారు''అని చెప్పడం ముగించింది.

'మాకు చదువురాదు. లాయరు గారు సంతకం పెట్టమన్న చోటల్లా పెట్టాము' అని వెన్నెల తల్లి బోరు బోరుమని ఏడ్చారు.

మొత్తం విన్న బాధ్యులు ''బాధపడకమ్మా! అతన్ని పిలిపించి మాట్లాడదాం'అని అతని చిరునామా అడిగారు. అతను ఎక్కడ ఉందీ తెలియదన్నారు. వాళ్లమ్మ మాత్రం ఊళ్లోనే ఉంటుందని చెప్పారు. దీంతో బాధ్యులు ఆమె తల్లికే లేఖ పంపారు.

వరుసగా రెండు వారాలు చేశారు. రాకపోయేసరికి ఆ ఊరి సర్పంచ్‌కి బాధ్యులు ఫోన్ చేశారు. " మేము ఎంత చెప్పినా అతగాడు విన లేదమ్మా! ఈ ముసలిదాన్ని ఊళ్లో వదిలి వెళ్లిపోయాడు. మీ లెటరు అందింది. మీరు ఏమి చర్య తీసుకున్నామేము కూడా మీ వైపే!"అన్నారు. 'ఊరికి అస్సలు రావడం లేదా?' అని అడిగితే ఎప్పుడన్నా వస్తాడని చెప్పారు. వచ్చినపుడు మేము లెటర్ పంపామనీ, మీకు ఫోన్ చేశామని చెప్పండి అన్నారు. కానీ మరో మూడు వారాలు గడిచినా అతని వైపు నుండి సమాధానం లేదు. 'మాకు న్యాయం జరిగితే చాలమ్మా! మేము ఇంతగా మోసపోతామనుకోలేదమ్మా!' అని వెన్నెల తల్లి బాధ్యుల్ని పట్టుకుని పెద్దగా ఏడ్చేశారు. బాధ్యులు ఆమెను ఓదార్చారు. వెన్నెల ఇప్పుడు ప్రయివేటుగా జాబ్ చేస్తూ డిగ్రీ చదువుతోంది. ధైర్యంగా ఉండమని బాధ్యులు వెన్నెలకు చెప్పారు. నా జీవితం నేర్పిన పాఠంతో నాకు చాలా ధైర్యం వచ్చింది!'అంది వెన్నెల. చివరకు బాధ్యులు ఐద్వా రాష్ట్ర నాయకుల సహకారంలో వాళ్లని మహిళా కమిషన్‌కు పంపారు. మహిళా కమిషన్ చైరపర్సన్‌తో మాట్లాడి వారికి న్యాయం జరిగేలా చూడమని చెప్పారు.

# ఐద్వా 13వ రాష్ట్ర మహాసభలు

అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం (ఐద్వా )13వ రాష్ట్ర మహాసభలు 2014 సెప్టెంబర్ 26-28 తేదీలలో విజయవాడలో జరుగనున్నాయి. 13 జిల్లాల నుండి 1,000మంది ప్రతినిధులు హాజరు కానున్నారు. ఐద్వా జాతీయ నాయకులు బృందాకరత్, సుధాసుందరరామన్, అధ్యక్షులు మాలినీ భట్టాచార్య హాజరవుతున్నారు.

ఆంధ్ర ప్రదేశ్ పునర్విభజన తర్వాత మహాసభలు జరుగుతున్నాయి. నూతన రాష్ట్రంలో మహిళల రాజకీయ, సామాజిక ఆర్థిక సమస్యలపై కూలంకషంగా సభలో చర్చించి కర్తవ్యాలు రూపొందించాల్సివుంది. 1936లో కృష్ణాజిల్లాలో ప్రారంభమైన మహిళా ఉద్యమం దేశవ్యాప్తంగా 25 రాష్ట్రాలలో కోటి యాభై లక్షల సభ్యత్వంతో మన రాష్ట్రంలో 4 లక్షల సభ్యత్వంతో 13 జిల్లాలలో కమిటీలు ఏర్పడి మహిళా సమస్యలపై శాయశక్తులా కృషి చేస్తుంది. ఈ సుదీర్ఘ ప్రయాణంలో ఐద్వా కొన్ని విజయాలు, అభివృద్ధిని సాధించింది.

ఈ మహాసభలలో ఈ మూడు సంవత్సరాల కృషిని సమీక్షించి నూతనంగా ఏర్పడిన ఆంధ్ర ప్రదేశ్‌లో మహిళల స్థితిగతులను చర్చించి నూతన కర్తవ్యాలను నిర్దేశించుకోవాల్సిన అవసరం ఉంది. విద్య, వైద్యం, అధికధరలు, హింస, మద్యం పాలసీ, పొదుపు సంఘాల సమస్యలపైనా చట్ట సభలలో 1/3వంతు రిజర్వేషన్లు మరియు మహిళా ఉద్యమాల ద్వారా సాధించుకున్న చట్టాల అమలు కొరకు సినిమా, టివి, ఫోర్నోగ్రఫీ తదితర అంశాలపై మహాసభ




చర్చించనున్నది. మహాసభల సందర్భంగా సెమినార్లు, సదస్సులు, ప్రదర్శనలు మొదలైన ప్రచార కార్యక్రమాలు నిర్వహిస్తున్నాము. ఈ మహాసభలు జయప్రదంగా జరుపుకునేందుకు ఐద్వా కార్యకర్తలు సమాయత్తం కావాలి.



# అం'తరాలు'

-ఎం. సుధ

జాజి పూలు కోస్తున్న వాణి చెయ్యి ఒక పువ్వు మీద ఆగిపోయింది. ఆమె ఆలోచనలు కూడా పరిపరి విధాల పోయాయి.

వాణి చిన్నప్పటి సంగతి మదిలో మెదిలింది. వాణి మేనత్త కళ్యాణి ఉన్నట్టుండి ఒకరోజు పుట్టింటికి వచ్చింది. పిల్లలంతా అత్త వచ్చింది, అత్త వచ్చింది అని సంబరపడ్డారు. ఏ సెలవులకో, పండక్కో రాలేదు. మౌనంగా ఉన్న అత్తనుచూసి పిల్లలు ఒక్కొక్కరూ అర్థమైనట్లే చల్లగా జారుకున్నారు. ఆమెను 'ఏమిటిలా వచ్చావని కానీ', 'ఏమైందని' కానీ ఎవరూ అడగలేదు. నాలుగు రోజులు గడిచాక వాణి తల్లి నెమ్మదిగా కళ్యాణి దగ్గరకు చేరి 'ఏమైందమ్మా కళ్యాణి, మేము అడిగే వరకూ చెప్పేలా లేవు. నీ మనసులో మాట చెబితే కదా, మాకు తెలిసేది'అంటూ మొదలుపెట్టింది.

ఒక్క పెట్టున ఏడుస్తూ చెప్పడం మొదలుపెట్టింది కళ్యాణి. 'ఏమీ లేదు వదిన, మా ఆయన చేస్తున్న వ్యాపారంలో పార్టనర్ మోసం చేశాడు. స్నేహితుని నమ్మినందుకు నిండా ముంచేశాడు. వ్యాపారం నడుస్తున్నట్లు ఉండేది. చాప కింద నీరులా లాభంలో పెద్దమొత్తాన్ని దారి మళ్ళించి నష్టాలు చూపించాడు స్నేహితుడు. అదేమిటని అడిగితే 'నన్నేమి చేయమంటారు' అని చేతులెత్తేశాడు. ఈ పరిస్థితుల్లో ఏమి చేయాలో తోచలేదు. తలెత్తుకోలేక జరిగిన మోసాన్ని తలచుకుంటూ ఆయన ఉన్నారు. ఏ దారీలేక నేను ఇలా వచ్చాను'అని చెప్పింది కళ్యాణి.

కళ్యాణి అన్నదమ్ములు నలుగురికి పెళ్ళిళ్ళయాయి. వ్యవసాయం, వ్యాపారం వంటివి చేస్తూ అందరూ ఉమ్మడి కుటుంబంలో ఉంటూ తల్లి సలహా సంప్రదింపులతో పిల్లా పాపలతో నడుస్తోంది కళ్యాణి పుట్టిల్లు. ఆ రాత్రి అన్నదమ్ములు ఇంటికి చేరాక అందరి భోజనాలు ముగిశాక నిద్రకుపక్రమించేముందు అందర్నీ పిలిచింది వసంతమ్మ. కళ్యాణి కుటుంబ పరిస్థితిని, వచ్చిన కష్టాన్ని విన్న అన్నదమ్ములు చెల్లెలి కుటుంబాన్ని గట్టెక్కించడానికి ఏమి చేయాలో ఆలోచించారు. ఉమ్మడి మీద ఉన్న ఆస్తిలో నుండి కొంత వ్యవసాయ భూమిని అమ్మి కళ్యాణికి ఇవ్వాలని, కష్టసుఖాల్లో చెల్లికి అండగా నిలబడాలనే నిర్ణయానికి వచ్చారు. కొడుకులు తీసుకున్న ఆ నిర్ణయానికి ఎంతగానో సంతోషించింది వసంతమ్మ.

ఆ రోజు పేపర్లో వచ్చిన వార్త 'ఐటి ఉద్యోగి భార్య, కొడుకును చంపి, తాను కూడా ఆత్మహత్య' చూసిన ప్రతి ఒక్కరికీ మనసంతా బాధ. ఎందుకిలా జరుగుతున్నాయి. ఎంత ముద్దుగా ఉన్నాడో ఆ బాబు. ఎలా చంపబుద్ధయింది ఆ తండ్రికి. విషయం బయటి ప్రపంచానికి తెలిసేందుకు నాలుగురోజులు పట్టింది. లక్ష పైగా జీతం, చీకూ చింతలేని చిన్న కుటుంబం. ఆ వార్త చదివిన ప్రతి ఒక్కరూ ఎందుకిలాంటి పరిస్థితి? కాస్త ఓపికపట్టి ఉంటే, కాస్త ఆలోచించి ఉంటే ఇంత దారుణం జరిగేది కాదేమో! పేపర్లలో రకరకాల ఊహాగానాలు. అసలు విషయం ఏమై ఉంటుందో. ఏమైనాగానీ వాణి మనసులో రకరకాల ఆలోచనలు. ఎందుకిలాంటి ఘోరాలు జరుగుతున్నాయి? వీటికి అడ్డుకట్టవేయలేమా?

కుటుంబ సంబంధాలు నానాటికీ విచ్ఛిన్నమతున్నాయి. 'మనీ' సంబంధాలకు ఉన్న విలువ మానవ సంబంధాలకు ఉండటం లేదు. వాళ్ళకి వచ్చిన కష్టాన్ని చెప్పుకోవటానికి కుటుంబ సభ్యులు లేరా? లేకుండా ఎందుకుంటారు? పోనీ సలహాలిచ్చే స్నేహితులు లేరంటారా? లేకుంటే ఆదరించే కొలీగ్స్ లేకుండా ఉంటారా?

నేను, నా సంసారం తప్ప ఇరుగు పొరుగు సంబంధాలు కానీ, చుట్టూ ఉన్న సమాజంలో ఏం జరుగుతోంది అన్న స్పృహ కానీ ఉండటం లేదు. అందుకే తనకొచ్చిన కష్టాన్ని ఇతరులకు చెప్పుకోలేని పరిస్థితి.

రెండేళ్ళు నిండాయో లేదో పిల్లాడ్ని స్కూల్‌లో జాయిన్ చెయ్యడానికి తల్లిదండ్రుల తహతహ. మంచి మార్కులు, మంచి గ్రేడు రావాలని తపించటమే. 100కి వంద మార్కులు వచ్చేయాలి మన పిల్లలకి. మరి

తరువాయి 36వ పేజీలో

**రెండేళ్ళు నిండాయో లేదో పిల్లాడ్ని స్కూల్‌లో జాయిన్ చెయ్యడానికి తల్లిదండ్రుల తహతహ. మంచి మార్కులు, మంచి గ్రేడు రావాలని తపించటమే. 100కి వంద మార్కులు వచ్చేయాలి మన పిల్లలకి. మరి వేలల్లో, లక్షల్లో ఫీజులు కట్టడంలేదా? ఖర్చుకు తగ్గట్లు మార్కులు రావాలి గదా! స్కూలు గేటు దాటడంతో మొదలు ఐఐటి కోచింగులు, ఎంసెట్ కోచింగులు అంటూ రెండేళ్ళు రుద్దుడు కార్యక్రమంతో సెకండరీ స్థాయి విద్య అవుతుంది. ఇంతవరకేనా పుస్తకాలతో కుస్తీ అంటే కాదు. ఉన్నత విద్యలో మన పిల్లల్ని ఉన్నతంగా చూసుకోవాలి. ఒత్తిడితోనే ఈ చదువులంతా. ఆ కాస్త ముగియడంతో క్యాంపస్ సెలక్షన్స్‌లో మంచి కంపెనీలో ఐదారంకెల జీతం. ఇంకేముంది జీవితంలో సెటిలయినట్లే. ఈ సెటిల్‌మెంట్‌తోనే సంతోషిస్తోంది నేటి తరం.**

# పరి 'పూర్ణమ్మ కథ'

-మృణాళిని

"ఛ... నేను అమ్మాయిని పరిపూర్ణ స్త్రీ చేస్తున్నది మంచి భార్య కావడానికి. 40 ఏళ్ల వరకు నేర్చుకుంటూ కూర్చుంటుందనుకున్నావా? పాతికేళ్లకే అన్ని వచ్చేస్తాయి. నా బంగారు తల్లికి."
"ఓహో! పరిపూర్ణ స్త్రీ అంటే పెళ్లికి డిగ్రీలాంటిదన్నమాట. సరే అయితే లేవండి." కోమలి కంగారుగా అంది.
"దేనికోయ్ అంత హడావిడి!"
"కూచిపూడి మేష్టార్ని పట్టుకురావాలి. ఇప్పుడే మొదలు పెట్టకపోతే పాతికేళ్లకు ఆమె పరిపూర్ణత్వం ఎలా సాధిస్తుంది... ఊ లేవండి"

"కోమలీ, పాప అస్తమానం అమ్మా అంటుందేం?'' కోమలి భర్త విసుగ్గా అడిగాడు. ''ఇంకేమనాలి'' కోమలి అడిగింది.

''ఎంచక్కా 'నాన్నా' అనాలి. పుట్టగానే పిల్లలకు 'నాన్నా' అనడం రాదేమిటో? ఇవి మీ ఆడవాళ్లు మా పై చేస్తున్న కుట్ర."

''పిల్లలకు ఎవర్ని పిలిస్తే పనులౌతాయో తెల్సు. మీరు భార్యల్ని మోసం చేసినట్లు పిల్లల్ని చేయలేరు" కోమలి అంది.

"ఇవాల్టి నుంచీ నేను దానికి 'నాన్నా' అనటం నేర్పుతాను. ''కో.భ పాపను ఎత్తుకుని 'నననననన' అనడం మొదలు పెట్టాడు. పాపా మూడు సార్లు 'మమమ్మ' అని భరించలేక ఏడ్చేసింది." చూసారా? 'నన' అనగానే ఏడ్చేస్తోంది" కోమలి పాపను ఎత్తుకుని సముదాయించటం ప్రారంభించింది.

కో.భ కోపంగా చూశాడు. "ఇదిగో అమ్మాయ్, మన పాపకు నీ బుద్దులు నేర్పావంటే ఊరుకోను. దాన్ని చిన్నప్పటి నుంచి పరిపూర్ణ స్త్రీగా తయారుచేస్తాను" గంభీరంగా చెప్పాడు కో.భ.

"పరిపూర్ణ స్త్రీ అంటే ఏమిటండీ" అమాయకంగా అడిగింది కోమలి.

"నువ్వు మాత్రం కాదు" ఇంకా కోపంగా అన్నాడు కో.భ.

"థాంక్‌గాడ్" అంది కోమలి.

"మీ అమ్మ నీకేమీ నేర్పకుండా పెంచింది. నీకు పెళ్లయ్యే నాటికి ముగ్గు పెట్టడం రాదటగా"

"ఇప్పటికీ రాదు" కోమలి అంది.

"కుట్లు, అల్లికలు, పువ్వులు కుట్టడం కూడా రావని అమ్మ చెప్పింది."

"కరెక్టు చాలా త్వరగా కనుక్కున్నారే ఈ విషయాలన్నీ" కోమలి అంది.

కో.భ కోపంగా చూసాడు. " నీ కూతురు నీలా ఉండటానికి వీల్లేదు. దాన్ని పరిపూర్ణ స్త్రీగా పెంచుతాను."

''ఓహో! పరిపూర్ణ స్త్రీ అంటే ముగ్గులు, కుట్లు వచ్చినమ్మాయన్నమాట"

"అంతేకాదు డాన్సు, సంగీతం, చిత్రలేఖనం, సాహిత్యం, ఇల్లు అలంకరించడం, తోటపని, వంటపని అన్నీ నేర్పిస్తా పాపకు" సగర్వంగా అన్నాడు కో.భ.

''డాన్సు అని వదిలేస్తే కుదరదండోయ్. అందులో భరతనాట్యం, కూచిపూడి, కథక్, మణిపురి, కథాకళీ, మోహినీ అట్టం నేర్పాలి. సంగీతమంటే హిందూస్తానీ, కర్నాటక సంగీతం, జానపదం, లలిత సంగీతం, సినిమా సంగీతం...."

"అబ్బ ఏంటా గోలా!'8 కో.భ. విసుక్కున్నాడు.

"మరి పరిపూర్ణ స్త్రీ అన్ని కళలు పరిపూర్ణంగా నేర్చుకోవాలి. సగం సగం నేర్చుకుంటే ఎలా?" కాస్సేపు నిశ్శబ్దం. కోమలి వేళ్లు లెక్కపెడుతోంది. "నా కూతురికి ఎన్ని నేర్పిస్తానోనని లెక్కపెట్టి కలలు కంటున్నావా?" కో.భ. నవ్వుతూ అడిగాడు.

''అబ్బే అదికాదు. ఇన్ని నేర్చుకోవాలంటే దానికి ఎన్నేళ్లు పడుతుందా? అని ఆలోచిస్తున్నా ఎంత కాదన్నా అన్ని కళల్లోనూ పరిపూర్ణత్వం వచ్చే సరికి 40ఏళ్లు వస్తాయి..."

"ఛ... నేను అమ్మాయిని పరిపూర్ణ స్త్రీ చేస్తున్నది మంచి భార్య కావడానికి. 40 ఏళ్ల వరకు నేర్చుకుంటూ కూర్చుంటుందనుకున్నావా? పాతికేళ్లకే అన్ని వచ్చేస్తాయి. నా బంగారు తల్లికి."

"ఓహో! పరిపూర్ణ స్త్రీ అంటే పెళ్లికి డిగ్రీలాంటిదన్నమాట. సరే అయితే లేవండి." కోమలి కంగారుగా అంది.

"దేనికోయ్ అంత హడావిడి!"

''కూచిపూడి మేష్టార్ని పట్టుకురావాలి. ఇప్పుడే మొదలు పెట్టకపోతే పాతికేళ్లకు ఆమె పరిపూర్ణత్వం ఎలా సాధిస్తుంది... ఊ లేవండి"

ఈలోగా స్టూల్ పట్టుకుని నడుస్తున్న పాప, స్టూల్ పక్కకి జరగడంతో, దభీల్మని కిందపడింది. ఫొల్లున ఏడుపు మొదలుపెట్టింది. కోమలి పాపను ఎత్తుకొని ఓదార్చింది.

''నువ్వింకా 'దాదైతకదై' అని గెంతుతావని నాన్నగారు అన్ని ఏర్పాట్లు చేస్తుంటే ఇలా దభీల్మని పడతావేంటమ్మా? తప్పు కదూ"

కోమలి అత్తగారు బయటకు వచ్చింది. "ఇందాకటినుంచి చూస్తున్నాను. ఎందుకు పసిదాన్ని అలా ఏడిపిస్తున్నారు

ఇద్దరూ అక్కడే వుండి?"

"పరిపూర్ణ స్త్రీ చిన్నప్పుడు ఇలాగే ఏడుస్తుందతయ్యా" కోమలి అంది.

"ఆవిడెవరు?" అయోమయంగా అడిగింది ఆవిడ. "అయ్యో పరిపూర్ణ స్త్రీ అంటే తెలీదా? మీ అబ్బాయి నడగండి చెప్తారు.

పెద్దయ్యాక మీ మనుమరాలు అదే కాబోతుంది" కోమలి చెప్పింది. కోమలి అత్తగారు కో.భ కేసి చూసింది.

"అమ్మా కోమలి మాటలకేం గాని, నా పిల్లమీద ఆమె గారి ప్రభావం లేకుండా చూడాలమ్మా" కో.భ. అన్నాడు.

"పిల్లమీద తల్లి ప్రభావం లేకుండా ఎలా చేస్తావురా?" కోమలి అత్త అడిగింది.

"నేను తలుచుకుంటే ఏవైనా చేయగలను తెలుసా? నీ కోడల్ని నువ్వెలా భరిస్తున్నావో గానీ ముగ్గులురావు, స్వెట్టర్లు అల్లడం రాదు. ఎంబ్రాయిడరీరాదు... ఇలాంటి భార్యను నేను కాబట్టి సహిస్తున్నాను. నా కూతురైనా పరిపూర్ణ స్త్రీగా ఎదగాలనుకుంటున్నాను. నా కూతుర్ని అన్ని కళలలోనూ ప్రవీణురాలిని చేస్తాను" ఆవేశంగా చెప్తున్నాడు కో.భ.

"ఓహో! అడవి బాపిరాజు హీరోయిన్‌లా చేస్తావా?" కోమలి అత్తగారు అడిగింది.

"కరెక్టు! నా కూతురు కావ్యనాయికలా పరిపూర్ణత్వం సాధించాలి. రోడ్లో వెళ్లే వారందరు ఎవరీ అమ్మాయి అంటే ఫలానా నాన్న కూతురని చెప్పుకోవాలి" తన్మయత్వంలో చెప్పుకుపోతున్నాడు.

"మరి నీ కావ్య నాయికకు పెళ్లి చేయడానికి కావ్యనాయకుడెలా దొరుకుతాడో ఆలోచించావా?" కోమలి అత్తగారు అడిగింది.

కో.భ. విసుక్కున్నాడు. "నువ్వు కూడా కోమలిలా మాట్లాడతావేమిటమ్మా. నా తల్లి పరిపూర్ణురాలైతే చాలాదూ. భర్త ఎలా వున్నా సర్దుకుపోతుంది. లేకపోతే మార్చుకుంటుంది."

"ఓహో, పరిపూర్ణత్వమంటే సర్దుకుపోయే ఆడపిల్ల అని అర్థమా? అలాగైతే ప్రపంచంలో ఆడవాళ్లందరూ పరిపూర్ణులేగా? భలేవారండి ఇంతమాత్రం దానికి నృత్యం, సంగీతం, గుర్రపు స్వారీలు నేర్చుకోవడం దేనికీ?" కోమలి అడిగింది.

"అబ్బబ్బ నీకసలు బుద్ధిలేదు కోమలీ. అవన్నీ వచ్చికూడా వినయంగా, అణకువగా ఉన్న ఆడపిల్లే పరిపూర్ణ స్త్రీ అన్నమాట. ఏమీ చేతకాని పిల్ల అణకువగా ఉండక ఏం చేస్తుంది? అన్నీ వచ్చి కూడా పెద్ద మనసుతో మగవాణ్ణి క్షమించే పిల్లే, వినయంగా నడుచుకునే పిల్లే పరిపూర్ణంగా ఉంటుంది. నా కూతుర్ని అలాగే తయారు చేస్తాను.

కోమలి నిట్టూర్చింది. "ఇంకా సంగీతం మేష్టార్ని పెట్టలేదు. ఎప్పటికి తయారు చేస్తారో ఏమిటో! మిమ్మల్ని చూస్తే జాలేస్తోంది."

"అసలు ముందు నీ ప్రభావం నుంచి అది బయటపడితే చాలు, పరిపూర్ణత్వానికి సరైన దారిలో పడినట్టే" కో.భ.అన్నాడు.

కోమలి అత్తగారు చప్పట్లు కొట్టింది."మా బాగా చెప్పావురా కోమలి పెంపకానికి పిల్లని దూరంగా ఉంచాలి. లేకపోతే నా కలలన్నీ కూలిపోతాయి. ఓ పనిచేయ్. ఇవాల్టి నుంచి పాప పెంపకం నీదే. దాన్ని ఒక్కక్షణం వదిలి పెట్టకుండా, దాని పనులన్నీ నువ్వు చేసావనుకో అది 'అమ్మ' అనడం మానేసి 'నాన్న' అంటూ వెంటపడుతుంది. ఇప్పటినుంచీ ఎవరు సేవలు చేస్తారో వాళ్ల ప్రభావవే ఎక్కువుంటుంది. పిల్లమీద... పద... పాపకు సెరిలాక్ కలుపు. సీసా స్టెరిలైజ్ చెయ్యాలి. పద..." కోమలి అత్తగారు హడావిడిగా చెప్తూ అటు తిరిగే సరికి కొడుకు లేడు.

"వీడేమయ్యాడు?"

పాపను చేతులు పట్టుకుని నడిపిస్తూ కోమలి నవ్వింది. "పరిపూర్ణ స్త్రీ మీద థీసిస్ రాయడానికి వెళ్లుంటారు."

**(కోమలి గాంధారం బుక్ నుంచి..)**

**34వ పేజీ తరువాయి**

వేలల్లో, లక్షల్లో ఫీజులు కట్టడంలేదా? ఖర్చుకు తగ్గట్లు మార్కులు రావాలి గదా! స్కూలు గేటు దాటడంతో మొదలు ఐఐటి కోచింగులు, ఎంసెట్ కోచింగులు అంటూ రెండేళ్ళు రుద్దుడు కార్యక్రమంతో సెకండరీ స్థాయి విద్య అవుతుంది. ఇంతవరకేనా పుస్తకాలతో కుస్తీ అంటే కాదు. ఉన్నత విద్యలో మన పిల్లల్ని ఉన్నతంగా చూసుకోవాలి. ఒత్తిడితోనే ఈ చదువులంతా. ఆ కాస్త ముగియడంతో క్యాంపస్ సెలక్షన్స్‌లో మంచి కంపెనీలో ఐదారంకెల జీతం. ఇంకేముంది జీవితంలో సెటిలయినట్లే. ఈ సెటిల్‌మెంట్‌తోనే సంతోషిస్తోంది నేటి తరం.

మనసుకు గాయం తగిలితే పంచుకునేందుకు స్నేహితులు కావాలి. కుటుంబంలో కలతలు వస్తే సరిచేసుకునేందుకు కుటుంబ సభ్యుల ఆసరా కావాలి. కష్టం వస్తే స్వాంతన పొందేందుకు ఇరుగు పొరుగు సహాయ సహకారాలు కావాలి.

ఒకప్పటి ఉమ్మడి కుటుంబాలు అంతరించిపోయాయి. నలుగురైదుగురు పిల్లలతో బతుకుతున్న కుటుంబాలు కానరావటంలేదు. ఒకరు లేదా ఇద్దరు పిల్లలతో నడుస్తున్నాయి నేటి కుటుంబాలు.

వాణి ఉలిక్కిపడి ఈ లోకానికి వచ్చింది. కళ్యాణత్తకు కష్టం వస్తే మిగిలిన కుటుంబం అంతా ఏకమై ఆదుకుంది. మరి ఇప్పుడు అటువంటి ఆపన్న హస్తాలు లేవంటారా? ఎందుకు లేవు? మనసుంటే మార్గం ఉంటుంది. ప్రతి సమస్యకూ పరిష్కారం ఉంటుంది. ఆత్మ హత్యలు, సకుటుంబ హత్యలు పరిష్కారం కావు. కాబోవు.



ఆరోగ్యం

# స్త్రీలల్లో శారీరక ధర్మాలు
## (ఒక అవగాహన)



-డా॥ భారతీ సాగర్

**టీనేజ్‌లోకి అడుగుపెడుతున్న అమ్మాయికి తన శరీరంలో వస్తున్న మార్పులు ఆందోళనని, సందిగ్ధాన్ని, భయాన్ని కలుగచేస్తాయి. తనకి ఏదో జరిగిపోతుందని భయపడటం జరుగుతుంది. అలాగే సాధారణ స్త్రీలలో నెలసరి ఋతుస్రావం వచ్చేటప్పుడు తాము మైల పడ్డామని, అప్పుడు పవిత్రమైన కార్యాలు ఏవీ చేయగూడదని, ఊరగాయని అంటరాదని, కరివేపాకు చెట్టుని, లేదా అసలు చెట్లనే అంటరాదని, ఇంట్లో ఓ మూలనే కూర్చోవాలనే భావాలను అనాదిగా నూరిపోస్తూ వస్తున్నారు.**

ప్రకృతి స్త్రీకి, పురుషునికన్నా ఉన్నతమైన భాధ్యతల్ని అప్పగించింది. అదే పునురుత్పత్తి, సంతానాన్ని కనటం, పుట్టిన శిశువుకి పోషణ. ఈ కర్తవ్యాలను నిర్వర్తించటానికి స్త్రీలలో ప్రత్యేకమైన శరీర నిర్మాణం ఉంటుంది. ప్రత్యేకమైన హార్మోన్లు స్రవించే వ్యవస్థ ఉంటుంది. వీటిలో భాగంగానే స్త్రీకి నెలసరి రక్తస్రావం జరుగుతుంది. అయితే వీటి గురించిన వ్యవహారిక జ్ఞానం, దురదృష్టవశాత్తు మన సామాజిక వ్యవస్థలో అందుబాటులో లేదు. తద్వారా అప్పుడే టీనేజ్‌లోకి అడుగుపెడుతున్న అమ్మాయికి తన శరీరంలో వస్తున్న మార్పులు ఆందోళనని, సందిగ్ధాన్ని, భయాన్ని కలుగచేస్తాయి. తనకి ఏదో జరిగిపోతుందని భయపడటం జరుగుతుంది. అలాగే సాధారణ స్త్రీలలో నెలసరి ఋతుస్రావం వచ్చేటప్పుడు తాము మైల పడ్డామని, అప్పుడు పవిత్రమైన కార్యాలు ఏవీ చేయగూడదని, ఊరగాయని అంటరాదని, కరివేపాకు చెట్టుని, లేదా అసలు చెట్లనే అంటరాదని, ఇంట్లో ఓ మూలనే కూర్చోవాలనే భావాలను అనాదిగా నూరిపోస్తూ వస్తున్నారు. (నాలో చైతన్యం వచ్చేవరకు నేనూ అదే భావజాలంలో కొట్టుకుపోయాను)

కానీ పై విషయాలన్నింటిని గూర్చిన పరిజ్ఞానం ప్రతి స్త్రీకి ఉండాలి. ప్రతి తల్లికి తెలియాలి. ఇంకా ప్రతి పురుషుడికి తెలియాలి. అప్పుడే స్త్రీల బాధలను అతను అర్థం చేసుకోగలడు.

స్త్రీలలో సుమారు 12-13 సంవత్సరాల వయస్సులో పునరుత్పత్తికి అవసరమైన హార్మోనుల స్రావం మొదలవుతుంది. దీని ఫలితంగా స్త్రీలలో వక్షోజాలు, జననేంద్రియాల నిర్మాణం క్రమంగా జరుగుతుంది. స్త్రీలలో కడుపు క్రింది భాగంలో ఉండే గర్భాశయం, అండాశయాలు, అండవాహికలు పూర్తి పరిణితిని సంతరించుకుంటాయి. ఈ మూడు భాగాలు పుట్టుకతోనే ఉంటాయి. కానీ పూర్తిగా వృద్ధి చెందవు. అమ్మాయి రజస్వల అయ్యే సమయంలోనే పూర్తి వృద్ధిని సంతరించుకొంటాయి. వక్షోజాలు, బాహ్య జననేంద్రియాలు రజస్వల అయ్యే సమయంలోనే వృద్ధి చెందుతాయి. అందుకే వీటిని ద్వితీయ లైంగిక లక్షణాలు అంటారు. ఈ సమయంలోనే ప్రతినెల పునరుత్పత్తికి సంబంధించిన హార్మోనుల చర్యల వలన స్త్రీలలో నెలకొకసారి అండాశయం నుండి అండం విడుదలవుతుంది. ఇది ఫలదీకరణం చెందితే అప్పుడే రజస్వల అయిన అమ్మాయి అయినా గర్భధారణ చేస్తుంది. ప్రతినెల (నెలసరి ఋతుస్రావం ప్రారంభమయిన రోజునే మొదటి రోజుగా తీసుకోవాలి.) 16వ రోజు లోపల అండం విడుదల అవుతుంది. కొంత మందిలో ఇది ఇంకా ఆలస్యంగా కూడా విడుదల కావచ్చు. ఈ సమయంలో స్త్రీ పురుషుడితో కలిస్తే గర్భధారణ ఖచ్చితంగా జరుగుతుంది. అయితే గర్భధారణ, ప్రసవం, గర్భధారణ సమయంలో తీసుకోవాల్సిన జాగ్రత్తల గురించి ఇంకో సందర్భంలో చర్చించుకుందాము. ప్రస్తుత అంశము నెలసరి ఋతుస్రావం గురించిన సాధారణ అవగాహన. పైన చెప్పినట్టు అండం కానీ ఫలదీకరణ చెందక గర్భధారణ జరగకపోతే గర్భాశయంలోని అంతర పొర (ఎండోమెట్రియం) హార్మోనుల సపోర్టు లేకపోవటం వలన తదుపరి వృద్ధి జరగకుండా చిన్న చిన్న ముక్కలుగా రక్తస్రావంతో కూడి వెలుపలికి వస్తుంది. అది అంటే ఎండోమెట్రియం పెరిగిన పరిణామాన్ని బట్టి, మూడు నుంచి ఐదు రోజుల వరకు ఈ రక్తస్రావం ఉంటుంది. కొంత మందిలో ఏడురోజుల వరకు కూడా కొద్ది కొద్దిగా కనపడవచ్చు. కొద్దిమందిలో ముఖ్యంగా టీనేజ్ అమ్మాయిలలో దాదాపు 60-70 శాతం మందిలో ఈ రక్తస్రావం కడుపు నొప్పి (ముఖ్యంగా పొత్తికడుపు నొప్పి)తో లేదా

**నెలసరి రక్తస్రావం తొంభైశాతం మందిలో 28 రోజులకి వస్తుంది. కొంతమందిలో 30రోజులకి వస్తుంది. ఈ మాసిక రక్తస్రావం అయ్యేవ్యవధి 21 రోజులపైన, 30 రోజుల లోపల ఉండాలి. నెలసరి 21 రోజులకన్నా తక్కువ వ్యవధిలో వస్తుంటే డాక్టర్‌ని సంప్రదించాలి. కొంతమందిలో 30-35 రోజుల వ్యవధికి రావచ్చు కానీ 30 రోజులు దాటి వస్తుంటే అవసరమైన పరీక్షలు చేయించుకోవాల్సి ఉంటుంది.**

నడుము నొప్పి లేదా తొడలు, కాళ్ళు నొప్పితో వస్తుంది. ఇంకా కొంత మందిలో అయితే కళ్ళుతిరగటం, స్పృహ కోల్పోవటం లాంటివి కూడా ఉంటాయి.

రక్తస్రావం పరిమాణం కూడా పరిమితంగానే ఉండాలి. 80% మందిలో మొదటిరోజు, రెండవ రోజు పగలు రెండు ప్యాడ్స్, రాత్రి ఒక ప్యాడ్ తడిసేంతటి రక్తస్రావం ఉంటుంది. మూడవరోజు ఒక ప్యాడ్ ఉపయోగించేంత ఉంటుంది. నాలుగవరోజు, అయిదవరోజు అత్యల్పంగా ఉంటుంది. దీనిని దాటి అధికంగా రక్తస్రావం అవుతున్నా లేదా గడ్డలుగా రక్తస్రావం 5-7 రోజులకన్నా అధికంగా ఉన్నాకూడా డాక్టర్ సలహా అవసరమవుతుంది. అంతేకాదు నెల మధ్యలో ఎప్పుడు రక్తస్రావం అయినా, లేదా శారీరక కలయిక తరువాత రక్తస్రావం అయినా డాక్టర్‌ని సంప్రదించాలి.

అలాగే నెలసరి రక్తస్రావం తొంభైశాతం మందిలో 28 రోజులకి వస్తుంది. కొంతమందిలో 30రోజులకి వస్తుంది. ఈ మాసిక రక్తస్రావం అయ్యేవ్యవధి 21 రోజులపైన, 30 రోజుల లోపల ఉండాలి. నెలసరి 21 రోజులకన్నా తక్కువ వ్యవధిలో వస్తుంటే డాక్టర్‌ని సంప్రదించాలి. కొంతమందిలో 30-35 రోజుల వ్యవధికి రావచ్చు కానీ 30 రోజులు దాటి వస్తుంటే అవసరమైన పరీక్షలు చేయించుకోవాల్సి ఉంటుంది.

అయితే స్త్రీల ప్రత్యుత్పత్తి అవయవాలకు సంబంధించిన ఈ మార్పులన్ని ఎలా చోటు చేసుకుంటున్నాయో చూద్దాము. స్త్రీలలో హైపోథాలమస్, పిట్యూటరీ అంత: స్రావ గ్రంథులు వాటి స్రావాల ద్వారా స్త్రీలలో అండాశయం నుంచి విడుదలయ్యే హార్మోన్ల స్రావాలను నియంత్రిస్తాయి. అలాగే అండాశయం నుంచి ఏర్పడే హార్మోన్ల యొక్క పరిమాణం హైపోథాలమస్ నుంచి విడుదలయ్యే (nrh - గొనడో ట్రోఫిన్ రిలీజింగ్ హార్మోన్) హార్మోన్ స్రావాలపై ప్రభావం చూపుతుంది. ఇవి ఒకదాని నొకటి అంతర్గతంగా నియంత్రించుకొంటూ ఉంటాయి. ఇవికాకుండా హైపోథాలమస్ బాహ్య పరిసరాల నుంచి వ్యక్తి ఎదుర్కొనే వత్తిళ్ళకి, మానసిక ఆందోళన, దు:ఖం వంటి వాటికి స్పందిస్తుంది. కనుక, అలాంటి పరిస్థితులలో హైపోథాలమస్ - పిట్యూటరీ - అండాశయం-క్రియా అక్షం కూడా డిస్టర్బ్ అయ్యి ,నెలసరి ఋతుస్రావానికి సంబంధించిన సమస్యలను కలుగచేస్తాయి. అండాశయాలలో వికృతులు, పిట్యూటరీ గ్రంథీ వ్యాధులు కూడా ఈ క్రమాన్ని డిస్టర్బ్ చేస్తాయి. ఉదా॥ టీనేజ్ అమ్మాయిలు పరీక్షల సమయంలో వాళ్ళు ఎదుర్కొనే వత్తిడి కారణంగా ఒక్కోసారి నెలసరి లేటుగా వస్తుంది. అలాగే ఆహారం సరిగా తీసుకోకుండా సన్నగా తయారయ్యే అమ్మాయిల్లో కూడా నెలసరులు సరిగా రాని పరిస్థితి ఏర్పడుతుంది. అట్లాగే జంక్‌ఫుడ్ అధికంగా తీసుకొని విపరీతంగా లావు అయ్యే ఆడపిల్లల్లో కూడా నెలసరి రెండు, మూడు నెలలకోసారి వస్తుంది. వీళ్ళల్లో హార్మోన్ల అసమతౌల్యం ఏర్పడుతుంది. దీనివలన హైపోథాలమస్‌కి అండాశయం నుంచి విడుదలయ్యే హార్మోన్లు ఇచ్చే నియంత్రణ సంకేతాలు సరిగా అందవు.

పైన చెప్పుకున్న హార్మోన్ల వ్యవస్థ వలన గర్భాశయం, అండాశయం వాటి శారీరక పనులను నిర్వర్తిస్తాయి. అండాశయం నుంచి ఏర్పడే ఈస్ట్రోజన్, ప్రొజెస్టిరాన్ హార్మోన్ల చర్యల వలన గర్భాశయంలోని లోపలి పొర పెరగటం జరుగుతుంది. నెలకొకసారి ఈ రెండు హార్మోన్ల విడుదల ఆగిపోవటం వలన ఈ పొర ఊడిపోయి ముక్కలు ముక్కలుగా ఋతుస్రావంతోపాటు వెలుపలికి వస్తుంది. నెలసరి వచ్చే సమయంలో ఈస్ట్రోజన్, ప్రొజెస్టిరాన్ హార్మోన్లు అండాశయం నుంచి అత్యంత అల్ప ప్రమాణంలో విడుదలవుతాయి. ఈ అల్పప్రమాణం హైపోథాలమస్‌ని ఉత్తేజితం చేసి GNRH హార్మోన్ విడుదలయ్యేలాగా చేస్తుంది. GNRH తిరిగి పిట్యూటరీ గ్రంథిని ఉత్తేజితం చేసి, దానినుంచి ఫాలికుర్ స్టిములేటింగ్ హార్మోన్ (FSH) మరియు ల్యూటినైజింగ్ హార్మోన్ విడుదలయ్యేలాగా చేస్తుంది. నెలసరి రక్తస్రావం జరుగుతున్న సమయంలోనే FSH హార్మోన్ పిట్యూటరీ నుంచి స్రవించటం మొదలవుతుంది. ఈ హార్మోన్ పరిమాణం మెల్లగా పెరుగుతూ వస్తుంది. ఈ హార్మోన్ అండాశయంలోని అనేక ఫాలికల్స్‌లో ఒక

**తరువాయి 43వ పేజీలో**

**అండం విడుదల అయిన తరువాత అండాశయంలో మిగిలి ఉండే ఫాలికల్ కొంతకాలం వరకే, అంటే నెలసరి వచ్చిన తరువాత అండం విడుదల అయిన (9-16 రోజులలో ఎప్పుడైన) తరువాత 10నుంచి 15 రోజులలో నశించి పోతుంది. దాని వలన ఫాలికల్ నుంచి ఉత్పన్నమయ్యే ప్రొజెస్టిరాన్ హార్మోన్ స్రావం ఆగిపోతుంది. అందుచేత గర్భాశయంలోని ఎండోమెట్రియంలో కొంచెం భాగం ముక్కలు ముక్కలుగా రాలిపోతూ ఎండోమ్రెటియం లోపలి భాగంలోని ధమనుల నుంచి వచ్చే రక్తస్రావంతో కలిసి బైటకు స్రవిస్తుంది. దీనినే మనం నెలసరి అని, బహిష్టు అని, మెన్‌స్ట్రుయేషన్ అని అంటాము.**

క్రీడలు





# పతకాల సంతోషికి ఐద్వా అభినందనలు

పద్నాలుగు సంవత్సరాల తరువాత 'మరో మల్లీశ్వరి' శ్రీకాకుళం జిల్లాకు చెందిన ఆ ఒలింపిక్ పతక విజేతగానే ఉత్తరాంధ్రకు చెందిన తెలుగమ్మాయి మత్స సంతోషి అంతర్జాతీయ స్థాయిలో పతకం సాధించింది. గ్లాస్గో నగరంలో జరిగిన పోటీలో మొదట కంచు పతకం సాధించిన ఈ విజయనగరం జిల్లా ఇంటర్ విద్యార్థిని ఆ తరువాతి పరిణామాలతో రజత పతకం పొందగలిగారు. తన ప్రాంతపు వెయిట్ లిఫ్టింగ్ క్రీడా ప్రముఖుల వారసత్వాన్ని నిలబెడుతూ దాదాపు దశాబ్దంన్నర తరువాత అంతర్జాతీయ స్థాయిలో పతకాన్ని గెలుచుకుని దేశ ప్రతిష్టను కూడా ఇనుమడింపచేసిన సంతోషిని ఐద్వా అభినందిస్తుంది.

దిగువ మధ్య తరగతి కుటుంబ నేపథ్యం, క్రీడా వసతులు కరువైన పరిస్థితులను తట్టుకుని ఈ ఇరవై ఏళ్ళ యువతి అంతర్జాతీయ పోటీలో విజయం సాధించడం వెనుక ఉత్తేజకరమైన కృషి, కుటుంబ సభ్యుల కష్టాలతో ఉబికిన కన్నీటిని కనురెప్పల చాటునే దాచుకుని లక్ష్యంపై దృష్టి నిలిపిన దీక్ష, ప్రతిభను పసిగట్టి అంతా ఒక్కటై వెంట నిలిచింది కుటుంబం కనిపిస్తాయి.

సంతోషి స్వస్థలం విజయనగరం జిల్లా కొండ వెలగాడ. నెల్లిమర మండలానికి చెందిన కొండవెగాడ, కొండగుప్పం గ్రామాల పేర్లు చాలామందికి తెలియకపోవచ్చు కానీ, ఈ రెండుచిన్న పల్లెలు వెయిట్ లిఫ్టర్లకు పేరు పొందినవి. నలుగురు సంతానం ఉన్న కుటుంబంలో అందరికంటె చిన్నది. ఆమె తండ్రి నెల్లిమర జూట్ మిల్లులో కార్మికుడు. నెలకు రెండు వేల జీతం. సంతోషి కంటే పెద్ద వారైన ఇద్దరు అమ్మాయిలు, ఓ అబ్బాయిని పోషించాల్సిన, చదివించాల్సిన బాధ్యత తల్లిదండ్రుల పట్టుదల వల్ల స్కూల్లో చేరి చదువుకుంటున్నా అద్దె ఇల్లు, గుడ్డి దీపాల మధ్య సాగే చదువు కుటుంబ ఆర్థిక సమస్యలను పరిష్కరించగల పరిస్థితి ఆమెకు కనిపించలేదు. అదే సమయంలో సంతోషికి వరుసకు మామయ్య, వెయిట్ లిఫ్టింగ్ కోచ్ చల్లా రాము నుంచి అనూహ్యమైన ప్రతిపాదన వచ్చింది. ఆయన వెయిట్ లిఫ్టింగ్‌ను గూర్చి వివరించి నేర్చుకుంటావాని ప్రశ్నించారు. బరువులు ఎత్తడం కష్టమని భావించి వెనుకాడిన సంతోషికి కష్టమయినా పట్టుదలతో పనిచేస్తే అమ్మాయిలు ఈ క్రీడలో ఛాంపియన్లు కావచ్చు అని నచ్చజెప్పారు. ఎంత కష్టమయినా సరే నేర్చుకుని పేరు తెచ్చుకోవాలన్న పట్టుదల ఆమెలో కలిగేట్టు చేశారు.

పోటీలో 53 కేజిల విభాగంలో సంతోషి మొత్తం 188 కేజిలు ఎత్తగల్గడం ద్వారా మూడో స్థానంలో నిలిచి కాంశ్య పతకాన్ని గెలుచుకున్నారు. అయితే 196 కేజిలు ఎత్తి మొదటి స్థానంలో నిలిచి బంగారు పతకం అందుకున్న నైజీరియన్ క్రీడాకారిణి చికా అమలహా డోపింగ్ పరీక్షలో విఫలం కావడంతో సంతోషి రెండో స్థానానికి చేరుకుని రజత పతకం పొందారు. సవాళ్లను ఎదుర్కొనేందుకు సంసిద్ధులై ఉన్న వారినే పతకాలు దక్కుతాయంటే ఇదేమరి.

ప్రథమంగా 2005లో విశాఖ నగరంలోజరిగిని రాష్ట్ర స్థాయి పోటీల్లో బంగారు పతకం గెలుచుకున్నారు.

2006లో రాష్ట్ర స్థాయి గ్రామీణ క్రీడా పోటీలో రజత పతకం సాధించారు.

కామన్‌వెల్త్ పోటీల్లో రజత పతకంతో కలుపుకుని సంతోషి అంతర్జాతీయ స్థాయిలో మొత్తం పదమూడు పతకాలను సాధించారు.

చైతన్య మానవి

అవగాహన సందర్భం

# 'స్వయం నిర్ణయాలే జీవన సాఫల్యాలు'

– శిలాలోలిత

ఈ మధ్య కరీంనగర్‌కి వెళ్ళాను. 'స్త్రీలల్లో ఆత్మవిశ్వాసం పెంపొందించేదెలా'? అనే టాపిక్ మీద 'ఉమెన్స్ కాలేజీ'లో మాట్లాడమని పిలిచారు. దగ్గరేకదా అని వెళ్ళాను. రేపటితరం పిల్లల్లో ఆత్మ విశ్వాసాన్ని నింపడమంటే మనకిష్టమైన పనేకదా!

అక్కడికి వెళ్ళాక, ప్రిన్సిపాల్ హాస్టల్‌లో ఏర్పాటు చేసిన ఒకరూమ్ దగ్గరకు తీసుకెళ్ళారు. ఆవిడ వెనక భయం భయంగా, బిడియపడ్తూ ఒకామె నిల్చొని వుంది. నన్ను ఎంతో ఉత్సాహంగా గమనిస్తోంది. ప్రిన్సిపాల్, ఆమె వైపు తిరిగి 'సుజాతా! మేడమ్ దగ్గర నువ్వుండు. తనకేదన్నా అవసరమొస్తుందేమో' అన్నారు. సంతోషంతో సుజాత కళ్ళు మెరిశాయి. కాళ్ళకు మెట్టెలు, చేతులకి మట్టిగాజులు, నేత చీర, తలనిండా మల్లెలు, పొడుగాటి జడ, కళ్ళనిండుగా కాటుక, మెడలో నల్లపూసల దండ, ముక్కు పుడక, ఎర్రటి పెద్దబొట్టు, కాళ్ళకు రబ్బరు చెప్పులు. ఇదీ సుజాత పూర్తి రూపం.

'మిమ్మల్ని ఓసారి ముట్టుకోవచ్చా'! – అని ఇబ్బంది పడ్తూ అడిగింది.

'ఎందుకమ్మా' ! అన్నాను. ఆశ్చర్యంగా.

'నేను మీరు రాసిన పుస్తకాలన్నీ చదివాను. మీ పేరంటే నాకిష్టం. మీరు చేస్తున్న పనులు కూడా తెలుసు. మీరొస్తున్నారనగానే మేడమ్‌ని అడిగాను. పరిచయం చెయ్యమని. కానీ మీతో కొంతసేపు గడిపే అవకాశం వస్తుందని నేను ఊహించనైనా లేదు. నేను నమ్మలేక పోతున్నాను'అని ఉద్వేగంతో మాట్లాడుతోంది.

'సుజాతా ! నేనుకూడా మీలాంటి మనిషినే. నన్ను మామూలుగా చూడు అంటూ అప్యాయంగా చెయ్యి నొక్కాను.

నా ఆత్మీయ స్పర్శకు ఆమె రెండు కళ్ళు గేట్లు తెరుచుకుని ప్రవహించడం మొదలుపెట్టాయి.

సుజాత మొహమాటానికి అడ్డు తెర తొలగింది. మాట్లాడ్డం మొదలు పెట్టిందిలా. ' నాకు మిమ్మల్ని చూస్తుంటే మా పెద్దక్క గుర్తొస్తోంది. మిమ్మల్ని అక్కా ! అని పిలవొచ్చా!'

'తప్పకుండా!'

"మేం ముగ్గురక్క చెల్లెళ్ళం. మానాన్న పేదపూజారి. అతి కష్టం మీద ఇద్దరక్కల పెళ్ళి చెయ్యగలిగారు. నన్ను మా అక్కలిద్దరూ చాలా ప్రేమగా చూసుకొనేవారు. అమ్మలేని లోటు తీర్చాలనుకొనేవారు. సంగీతం నా ఆరోప్రాణం. వీణ నేర్చుకున్నాను. జీవితాంతం పాటలు పాడుకుంటూ సంగీతమే లోకంగా బతకాలనుకున్నాను. తినడానికి లేదన్న పేదరికం కూడా నన్ను బాధించలేదు. పాట ఉంటే చాలనుకునే దాన్ని. ఎట్లాగైనా పెళ్ళిచేసి బాధ్యత ఒదిలించుకోవాలని నాన్న తాపత్రయం. ఇంటర్ వరకే చదువుకోగలిగాను. ఓపెన్ యూనివర్సిటీలో డిగ్రీ చెయ్యాలనుకునే దాన్ని. కానీ ఆ ఫీజులు కూడా శక్తికి మించినవే. ఓ.సి. కావడంతో స్కాలర్‌షిప్పులు లేవు. చదువు, సంగీతం మానకూడదనుకున్నాను. ఒక రాత్రి నాన్నకు గుండెపోటు రావడంతో తొందర్లో ఇక పెళ్ళి చేసెయ్యాలని నిర్ణయించుకున్నారు. నాకు, అతనికీ 10సం॥ల గ్యాప్ వుంది. అతనూ పూజారే. వాళ్ళమ్మకు పక్షవాతం వచ్చి మంచాన పడితే పెళ్ళి చేసుకుంటే, పెళ్ళాం చూస్తుందని చేసుకున్నాడట. అప్పటివరకు ఉన్నంతలో మా పుట్టిల్లొక భూలోక స్వర్గం. నేను ఇక మెట్టినింట్లనే భూలోక నరకంలో అడుగుపెట్టాను. నేను కదిలితే తప్పు. మెదిలితే తప్పు. గాలి పీలిస్తే తప్పు. గాలి ఒదిలితే తప్పు. మా అమ్మను నేను చూడలేదుకదా! అత్తనే అమ్మనుకొని అన్నీ మంచం మీదే చేశాను. ఆవిడ ఎంత సాధించేదో చెప్పలేను. ఒకసారి వీపు గోకమంటే దురదలేని చోట గోకానంటూ, కర్రతో కొట్టింది. ఆవిడకు దురదెక్కడుందో నాకెలా తెలుస్తుంది. చెప్పండి. తెల్లవారు ఝామున నాలుగింటికి లేస్తాను. దీపారాధనకు దేవుడు సామాన్లు అన్నీ తోమడం మొదలుపెడ్తాను. ఇక అక్కడి నుంచి దండకం మొదలు. సరిగ్గా తోమలేదనీ, మానాన్న నాలాంటి శని ఒదిలించుకుని తక్కువ రేటుకు ఆయనకు అంటగట్టిన దౌర్భాగ్యుడనీ, ఇంటర్ చదివానన్న పొగరనీ, ఆయన ఏడో తరగతితోనే చదువు ఆపేసాడని నాకు తెలిసిపోయిందనీ, వంటరాదనీ, పిల్లాడ్ని పెంచడం రాదనీ ఇలా ఒకటి కాదు ఎన్నంటాడో, ఎన్నిసార్లు చెంప దెబ్బలు కొడ్తాడో. ఆయన ఇంట్లోకి అడుగు పెడ్తాడంటేనే ఒణుకు నాకు. వినీ వినీ చివరకు నేనెలా అయిపోయానంటే నిజంగా నాకేదీ రాదేమో! అందుకే ఆయనకు అంత

"మేం ముగ్గురక్క చెల్లెళ్ళం. మానాన్న పేదపూజారి. అతి కష్టం మీద ఇద్దరక్కల పెళ్ళి చెయ్యగలిగారు. నన్ను మా అక్కలిద్దరూ చాలా ప్రేమగా చూసుకొనేవారు. అమ్మలేని లోటు తీర్చాలనుకొనేవారు. సంగీతం నా ఆరోప్రాణం. వీణ నేర్చుకున్నాను. జీవితాంతం పాటలు పాడుకుంటూ సంగీతమే లోకంగా బతకాలనుకున్నాను. తినడానికి లేదన్న పేదరికం కూడా నన్ను బాధించలేదు. పాట ఉంటే చాలనుకునే దాన్ని. ఎట్లాగైనా పెళ్ళిచేసి బాధ్యత ఒదిలించుకోవాలని నాన్న తాపత్రయం.

అయన బయటికి వెళ్ళగానే నేను పుట్టింటి నుంచి తెచ్చుకున్న ప్రాణప్రదమైన 'వీణ'ను వాయిస్తూ లోకాన్ని మర్చిపోయేదాన్ని. ఒక్కోసారి పిల్లి పాలుతాగడం, ఎవరో వచ్చి పిలిచినా నేను పలకకపోవడం జరిగి, నా వీపు మీద వాతలు తేలేవి. అతనికి నేనంటే ఎందుకు కోపం? అతనికి నన్ను కొట్టే హక్కెక్కడిది? అసలు ఆడవాళ్ళు ఎందుకిలా మాటలు పడాల్సి వస్తోంది. అసలు ఈ మగాడెవరు? ఈ పెళ్ళంటే ఏమిటి? పెళ్ళిలేకపోతే జీవితం లేదా? ఆడవాళ్ళు ఎందుకు తక్కువగా చూడబడ్తున్నారు? చిన్నక్కను కూడా తాగొచ్చి బావ కొడ్తుంటే చూశాను. ఆడదంటే మనిషికాదా? వాళ్ళింట్లో ఉండే వస్తువా? ఆమెకు మనసు ఉండకూడదా?"

కోపం వస్తోంది. నేను అందంగానే ఉంటానని అందరూ అంటారు కదా మరి. ఆయనెందుకలా అంటున్నారు. నాకర్థమయ్యేదికాదు. ఆయన బయటికి వెళ్ళగానే నేను పుట్టింటి నుంచి తెచ్చుకున్న ప్రాణప్రదమైన 'వీణ'ను వాయిస్తూ లోకాన్ని మర్చిపోయేదాన్ని. ఒక్కోసారి పిల్లి పాలుతాగడం, ఎవరో వచ్చి పిలిచినా నేను పలకకపోవడం జరిగి, నా వీపు మీద వాతలు తేలేవి. అతనికి నేనంటే ఎందుకు కోపం? అతనికి నన్ను కొట్టే హక్కెక్కడిది? అసలు ఆడవాళ్ళు ఎందుకిలా మాటలు పడాల్సి వస్తోంది. అసలు ఈ మగాడెవరు? ఈ పెళ్ళంటే ఏమిటి? పెళ్ళిలేకపోతే జీవితం లేదా? ఆడవాళ్ళు ఎందుకు తక్కువగా చూడబడ్తున్నారు? చిన్నక్కను కూడా తాగొచ్చి బావ కొడ్తుంటే చూశాను. ఆడదంటే మనిషికాదా? వాళ్ళింట్లో ఉండే వస్తువా? ఆమెకు మనసు ఉండకూడదా?"

మాట్లాడ్డం ఆపి వెక్కి వెక్కి ఏడుస్తోంది.

భుజం మీద చెయ్యేసి మంచినీళ్ళిచ్చాను. కొంత సేదతీరింది. పదేళ్ళు సేవచేయించుకుని మా అత్త చచ్చిపోయింది. ఆమె ఒంటి మీదున్న బంగారాన్నీ కూతుళ్ళు పంచుకొని, ఇంకొక గొలుసు కనబడలేదని, దొంగతనాన్ని నాపై మోపి నానా మాటలన్నారు. మంచంమీద అన్నీ ఎత్తి పోసినందుకు నన్నొక దొంగను చేశారు. చాన్నాళ్ళు బాధపడ్డాను. పురిట్లోనే నాకు కూతురు పుట్టి చచ్చిపోయింది. చంద్రవంక లాంటి మొఖం దానిది. పీడా పోయింది. చచ్చిందిలే. దానికి కట్నమిచ్చి ఎక్కడ చేస్తాను అని ఆయనంటుంటే జుగుప్స వేసింది. కొడుకు పుట్టాడు. వాడిప్పుడు 10[th] క్లాస్ కొచ్చాడు. వాడు నాన్నకు నమూనాగా తయారయ్యాడు. నేనంటే అస్సలు విలువుండదు. నా మనసు విరిగి పోతుందక్కా గత రెండేళ్ళనుంచి ఇంటిపక్క నున్న స్కూల్లో సంగీతం పాఠాలు చెబ్తున్నాను. ఆ జీతం రాగానే తీసుకుంటాడు కానీ, నన్ను వేరే వాళ్ళు గౌరవించడం భరించ లేడు. ఒకసారి 'తాగొచ్చి, ఇల్లంతా ఇరుకైపోయింది. ఆ వెధవ వీణను అమ్మేస్తాను లేధ పగలగొడ్తాను. అని గొడవ పెట్టుకున్నాడు. అది నా ప్రాణం కదా! భరించలేకపోయాను. అసలు నేను ఎదురు చెప్పనక్కా! మాట్లాడను కూడా! అదీ భరించలేడు. ఆ వీణను కాపాడుకోవాలని మ్యూజిక్ కాలేజీ వాళ్ళకు ఊరికే ఇచ్చేసాను. అది మా అమ్మ గుర్తు మరి. పిల్లాడికి పబ్లిక్ పరీక్షలు వాడ్ని దగ్గరుండి చదివించు, ఒండిపెట్టు. ఈ భోగంవేషాలు మాను. అని ఆర్డరేశాడు.

ఆ స్కూలుకెళ్ళిన రోజులన్నీ, పిల్లలతో సంగీతం మననస్సుకెంతో సంతోషంగా ఉండేది. ఇప్పుడదీ లేదు. దొరికిన ఖాళీలో నన్ను నేను తవ్వుకున్నానక్కా! నిజానికి నాకు అన్నీవచ్చు. ఏదైనా చేయగలను. నీకురాదు, నీకురాదు అని పదే పదే వినీ వినీ అదే నిజమన్న భ్రమలో ఉండిపోయానిన్నాళ్ళు నాకేదీ రాదనుకున్నానక్కా! ఇది ఒక పద్ధతి ప్రకారం జరిగిన కుట్ర అనీ, అతడి పొగరే కానీ నాలోపం కాదని అర్థం కావడానికి ఇన్నాళ్ళు పట్టిందక్కా!

మీ రచనలు నాలో ఎంతో ధైర్యాన్ని నింపేది. ఓల్గా, పి. సత్యవతి, కొండవీటి, కొండేపూడి నిర్మల, కుప్పిలి పద్మ ఇలా చాలా మంది పుస్తకాలు ఆయన కంట పడకుండా చదువుకున్నా అక్కా! ఈ చదువు నాకు ఆలోచనలిచ్చిందక్కా! ఆత్మవిశ్వాసాన్నిచ్చింది."

మీటింగ్ టైం అయిందని వచ్చారు. సుజాత ప్రారంభ గీతం పాడింది. అద్భుతమైన స్వరం. పూల పరిమళాలన్నీ ఆమె గొంతులో తేనెను కలుపుకుని కురిసాయా అన్పించింది. ఆ తియ్యదనానికి మనసు పులకించిపోయింది. కళ్ళు మూసుకుని తన్మయత్వంతో లోకాన్ని మరిచి పాడుతోంది.

మీటింగ్ టైం అయిందని వచ్చారు. సుజాత ప్రారంభ గీతం పాడింది. అద్భుతమైన స్వరం. పూల పరిమళాలన్నీ ఆమె గొంతులో తేనెను కలుపుకుని కురిసాయా అన్పించింది. ఆ తియ్యదనానికి మనసు పులకించిపోయింది. కళ్ళు మూసుకుని తన్మయత్వంతో లోకాన్ని మరిచి పాడుతోంది.

ఆ తర్వాత ఆమెను కౌగిలించుకొని అభినందించాను. చాలాసేపు మాట్లాడుకున్నాం. నేనున్నంత సేపు నాతోనే గడిపింది. నిన్నే సుజాత దగ్గర్నుంచి ఫోన్ వచ్చింది. మ్యూజిక్ కాలేజిలో టీచర్‌గా చేరిందట. నన్ను ఇంట్లో ఉండమంటావా? కాలేజి హాస్టల్‌లో జేరమంటావా? కొడుకు నా కొక్కడికే కాదు. నీక్కూడా కొడుకే. బాధ్యత ఇద్దరిదీ అందిట. వెళ్ళి పోతుందేమో అనే భయంతో ఒద్దనలేక గొణుక్కుంటూ నెమ్మదైపోయాడట నాకైతే ఒక స్త్రీ జీవితమన్నా గాడిన పడింది కదా అని సంతోషమేసింది. ఎవరి నిర్ణయాలు వాళ్ళు తీసుకోగలిగేంత శక్తివంతులైతే తప్ప సమస్యలు పరిష్కరింపబడవు. ●

మీడియా



# దృశ్యం

-కె. సమత

టైటిల్‌కి తగ్గట్లుగా హీరో కళ్ళు మూసి తెరిచే లోపు ఒక సామాజిక కథానాన్ని ప్రేక్షకుల ముందు ఉంచి మంచి ఆదరణ పొందిన సినిమా 'దృశ్యం'. ఒక సినిమా చూశాం అనే ఫీలింగ్ లేకుండా మన చుట్టు పక్కల జరుగుతున్న కథనంలా అనిపిస్తుంది. అంతా నేచురల్‌గా ఉన్నాయి ఈ సినిమాలో పాత్రలు, సన్నివేశాలు. వెంకటేష్, మీన పాత్రలు చాలా కీలకమైనవి. గత సంవత్సరం మలయాళంలో రిలీజ్ అయి అనేక అవార్డులు సొంతం చేసుకున్న సినిమాని తెలుగులోకి అనువదించారు. మొదటి ముప్పై నిమిషాలు ఒక మధ్య తరగతి చింతలు లేని కుటుంబాన్ని చక్కగా చూపించి సడన్‌గా ఒక మలుపు, అక్కడ నుండి ఒక సమస్య మొదలవుతుంది. తర్వాత ఏమి జరుగుతుందో అనే ఉత్కంఠతతో ప్రేక్షకులు కళ్లు ఆర్పకుండా చూసేలా చాలా సృజనాత్మకంగా నిర్మించిన అరుదైన సినిమా ఇది. నేను ఇంత పట్టున్న సినిమా తెలుగులో చూసి చాలా కాలమైంది. ఈ సినిమాని గమనిస్తే దర్శకుడు అనేక నైతిక విలువ గురించి సందేశాత్మకంగా మన ముందు ఉంచుతూ మనల్ని ఒకసారి ఆలోచించేలా చేసే ఒక ప్రయత్నం చేసినట్లు అనిపిస్తుంది. ఒక మంచి సినిమా అయినపుడు సాధారణంగా కమర్షియల్ ఫార్ములాను అనుసరించకపోయినా అది కమర్షియల్ సినిమాల కంటే మంచి ఆదరణ పొందుతుందని తెలుగు నటులకు, దర్శకులకి దృశ్యం ఒక అవగాహన ఇచ్చింది. ఒక మంచి మెసేజ్‌తో కొత్త రకం స్క్రీన్‌ప్లేతో ఒక భిన్నమైన కాన్సెప్ట్‌తో వచ్చి ఇంత పెద్ద సక్సెస్ సాధించడమే కాదు తెలుగు సినిమానే రిఫ్రెష్ చేసింది.

ప్రతి రూపాయి చాలా జాగ్రత్తగా చూసి ఖర్చు పెట్టుకుంటూ, అత్యాశలు లేకుండా ఉన్నంతలో సంతోషంగా జీవితం గడుపుతూ పల్లెటూరులో ఒక ఉన్నతమైన కుటుంబం. సర్దుకుపోయే భార్య, భర్త వారి ప్రేమ, అనురాగాలతో పెరుగుతున్న ఇద్దరు కూతుళ్ళు. పెద్ద కూతురు అంజు స్కూల్ నుండి నేచర్ క్యాంప్‌కి వెళ్ళి అక్కడ వరుణ్ అనే ఒక పోకిరి కంట పడుతుంది. అంజుని నగ్నంగా వీడియో తీసి తన కోరిక తీర్చకపోతే ఆ వీడియోని ఇంటర్నెట్‌లో అప్‌లోడ్ చేస్తానని, ఎవరికి చెప్పకుండా ఒంటరిగా తన ఇంటి వెనక రాత్రి కలవమని వరుణ్ హెచ్చరిస్తాడు. అంజు వాళ్ళ అమ్మతో జరిగినదంతా చెప్పి తనని తోడు తీసుకెళ్తుంది. మేము మధ్యతరగతి వాళ్ళం ఇలా చేయడం మంచిది కాదని తల్లి వరుణ్ కాళ్ళు పట్టుకుంటుంది. అతని క్రూర స్వభావంతో చివరికి అంజుని వదిలేస్తాను దానికి బదులు మీరు నా కోరికి తీర్చండి అంటూ మృగంలా ప్రవర్తిస్తుంటే అంజు ఇనుప రాడ్‌తో వరుణ్‌ని తలపై గట్టిగా కొడుతుంది తనను, తన తల్లిని రక్షించుకోవడానికి. వరుణ్ చనిపోతాడు. ఆ సమయంలో గట్టి ధైర్యంతో ఇద్దరు కలిసి వరుణ్ దేహాన్ని పెరట్లో పాతి పెడతారు. ఆ హత్య చేసినందుకు అంజు కుటుంబం ఎంత

**అంజు తనకు వచ్చిన సమస్య గురించి అమ్మతో చెప్పే సంఘటన ఈ కాలం యువతకి ఒక పెద్ద సందేశాన్ని ఇస్తుంది. ఈ మధ్య యువత బోలెడన్ని సమస్యలను ఎదుర్కొంటున్నారు. కానీ ఎక్కడో మొహమాటం, సిగ్గు, చెబితే పేరెంట్స్ ఏం అంటారో అనే భయంతో చెప్పకుండా వాళ్ళకి వాళ్ళే మధనపడుతూ ఉండిపోతున్నారు. కొంతమంది అలాంటి సమయంలో తీవ్రమైన నిర్ణయాలు తీసుకుని ఆత్మహత్యలు లాంటివి కూడా చేసుకుంటున్నారు. అలా ఉండకుండా పేరెంట్స్‌తో షేర్ చేసుకుంటే ఎంత పెద్ద సమస్య అయినా సరే పరిష్కారం దొరుకుతుంది.**

పశ్చాత్తాపానికి గురైంది, వరుణ్ ఏమై పోయాడో తెలియక ఒక పోలీస్ బ్యాక్ గ్రౌండ్ ఉన్న అతని కుటుంబం ఎలాంటి పరిణామాలు ఎదుర్కొంటుందో మన ముందు ఉంచడమే ఈ దృశ్యం సారాంశం. ఈ సినిమాలో రెండు కుటుంబాలూ రెండు సందేశాలు ఇస్తున్నాయి.

అంజు తనకు వచ్చిన సమస్య గురించి అమ్మతో చెప్పే సంఘటన ఈ కాలం యువతకి ఒక పెద్ద సందేశాన్ని ఇస్తుంది. ఈ మధ్య యువత బోలెడన్ని సమస్యలను ఎదుర్కొంటున్నారు. కానీ ఎక్కడో మొహమాటం, సిగ్గు, చెబితే పేరెంట్స్ ఏం అంటారో అనే భయంతో చెప్పకుండా వాళ్ళకి వాళ్ళే మధనపడుతూ ఉండిపోతున్నారు. కొంతమంది అలాంటి సమయంలో తీవ్రమైన నిర్ణయాలు తీసుకుని ఆత్మహత్యలు లాంటివి కూడా చేసుకుంటున్నారు. అలా ఉండకుండా పేరెంట్స్‌తో షేర్ చేసుకుంటే ఎంత పెద్ద సమస్య అయినా సరే పరిష్కారం దొరుకుతుంది. ఏం జరిగినా మొదట మనం మనం పేరెంట్స్‌తో చెప్పుకోవాలి అని చాలా చక్కగా ఒక సందేశాన్ని ఇచ్చారు. అనేక రకాల ప్రమాదాలు, కష్టాలు ఉన్నా ఈ గ్లోబల్ ప్రపంచంలో కుటుంబం అనే ఒక మైక్రో ప్రపంచం ఎంత సపోర్టివ్‌గా ఉంటుంది, మనల్ని ఎలాంటి పరిస్థితులు వచ్చినా ఎలా కాపాడుతుంది అన్న విషయం మనం అర్థం చేసుకోవాలి. అంజు కుటుంబం నుండి మనం ఆత్మ రక్షణ కోసం చేసిన హత్య తప్పుకాదు, అలాంటి సమయంలో ధైర్యంగా ముందడుగు వెయ్యాలి. మనకి చట్టం కూడా ఇదే చెబుతోంది.

వరుణ్ కుటుంబం, అతని బ్యాక్‌గ్రౌండ్ చూస్తే పిల్లల్ని ఎలా పెంచకూడదో తెలుస్తుంది. బిజీ మనుషులు, బిజీ ప్రపంచం. ఒక హై క్లాస్ కుటుంబంలో పిల్లలకి అన్ని సరిపడా ఉన్నాయా, వాళ్ళకి అన్ని లగ్జరీస్ ఇచ్చి కంఫర్టబుల్‌గా ఉంచుతున్నామా అంత వరకే పేరెంట్స్ ఆలోచిస్తున్నారు. పిల్లలు సరైన మార్గంలో నడుస్తున్నారా లేదా ఏమి చేస్తున్నారు ఇవన్నీ పట్టించుకునే ఓపిక, సమయం ఉండదు. సోషల్ నెట్‌వర్కింగ్ సైట్స్ మనుషుల్ని మరిపించే రక రకాల గాడ్జెట్స్ మన జీవితంలోకి మారుతున్న కాలాన్ని బట్టి వస్తూనే ఉన్నాయి. ఇంట్లో ఉన్న కాసేపు కూడా పిల్లలు ఇంటర్నెట్‌కి అతుక్కుపోతున్నారు. పేరెంట్స్ చేతిలో కూడా ఒక స్మార్ట్ ఫోన్. ఎవరి పని వాళ్ళది. ఖాళీ దొరికితే కుటుంబం మొత్తం కూర్చుని కులాసాగా మాట్లాడుకునే రోజులు పోతున్నాయి. ఎవరి లైఫ్ వాళ్ళది, పిల్లలకి చిన్నప్పటి నుండి సెపరేట్ రూమ్స్, పర్సనల్ కంప్యూటర్. ఇంటర్నెట్ బాగా ఉపయోగించుకుని మంచి నాలెడ్జి పెంచుకుని పిల్లలు చాలా పైకి ఎదుగుతారని పేరెంట్స్ ఆశ. దాని వల్ల వచ్చే ముప్పు గురించి కానీ, అదే కంప్యూటర్ అడ్వాన్స్ టెక్నాలజీ వల్ల పిల్లలు తప్పు దారి పడతారనే పిల్లలకి వ్యక్తిగత స్వేచ్ఛ (ప్రైవసీ) ఇస్తున్నాం అనే ఒక కాన్సెప్ట్‌తో మంచి ప్రవర్తన, మానవత్వం అంటే ఏంటో చెప్పడం కానీ చెడు అలవాట్ల జోలికి పోవద్దు అని చెప్పడం కానీ మానేస్తున్నాం. అసలు పిల్లలకి తల్లిదండ్రుల దగ్గర ప్రైవసీ దేనికండి? ఫ్రీడమ్ ఇస్తున్నారు కరెక్టే. దాన్ని సరిగ్గా ఉపయోగించుకుంటున్నారా? లేదా? ఆ స్వేచ్ఛని అదుపులో పెట్టాల్సిన చోట పెట్టాలి. మంచేదో చెడేదో తెలిసేలా చూసుకోవాలి. లేకపోతే మీ పిల్లలు వరుణ్ లాగా తప్పుదారి పట్టడానికి ఎంతో కాలం పట్టదు. మీ పిల్లల భవిష్యత్తు నాశనం కావడానికి ఒక రకంగా మీరిచ్చిన లగ్జరీస్, ప్రైవసీనే మిమ్మల్ని బాధ్యుల్ని చేస్తుంది. ●

---

**36వ పేజీ తరువాయి**

ఫాలికల్‌ని పెరిగేలా చేస్తుంది. అది సుమారు 20 మిల్లీ మీటర్ల వరకు పెరిగినపుడు ఆ ఫాలికిల్ నుంచి అండకణం అండవాహికలోకి విడుదల అవుతుంది. అక్కడ శుక్రకణంతో కలిస్తే ఆ స్త్రీలో గర్భధారణ జరుగుతుంది. లేదంటే ఆ అండకణం నశించి పోతుంది.

ఒకవేళ గర్భధారణ జరిగితే, గర్భాశయంలోని అంతరపొర (ఎండోమెట్రియం) ప్రొజెస్టిరాన్ హార్మోన్ చర్యవలన మందంగా మారి, ఫలదీకరణ చెంది ఏర్పడిన పిండము అండవాహికలలోంచి గర్భసంచిలోకి వచ్చి అక్కడ ఎండోమెట్రియంకి అంటుకొని అక్కడే వృద్ధి చెందుతుంది.

ఒక వేళ గర్భం ఏర్పడకపోతే గర్భ సంచీలోని ఎండోమెట్రియంకి హార్మోన్ సపోర్టు ఉండక పోవటం వలన మెల్లగా నశించిపోతూ ముక్కలు ముక్కలుగా రక్తంతో కూడి గర్భాశయ ముఖద్వారం నుంచి వెలుపలికి వచ్చి యోని ద్వారా స్రావం జరుగుతుంది ఈ స్రావాలనే మనం నెలసరి రావడం అంటాము.

ఇక్కడ ఇంకొక వివరణ అవసరమవుతుంది.అదేమిటంటే. అండం విడుదల అయిన తరువాత అండాశయంలో మిగిలి ఉండే ఫాలికల్ కొంతకాలం వరకే, అంటే నెలసరి వచ్చిన తరువాత అండం విడుదల అయిన (9-16 రోజులలో ఎప్పుడైన) తరువాత 10నుంచి 15 రోజులలో నశించి పోతుంది. దాని వలన ఫాలికల్ నుంచి ఉత్పన్నమయ్యే ప్రొజెస్టిరాన్ హార్మోన్ స్రావం ఆగిపోతుంది. అందుచేత గర్భాశయంలోని ఎండోమెట్రియంలో కొంచెం భాగం ముక్కలు ముక్కలుగా రాలిపోతూ ఎండోమెటియం లోపలి భాగంలోని ధమనుల నుంచి వచ్చే రక్తస్రావంతో కలిసి బైటకు స్రవిస్తుంది. దీనినే మనం నెలసరి అని, బహిష్టు అని, మెన్‌స్ట్రుయేషన్ అని అంటాము. ఇది శారీరక ధర్మమని, ప్రకృతి సహజమైనదని తెలిసాక ఇంకా అంటు, ముట్టు, మైల పద్ధామని మూలకూర్చుందామా? మీరే చెప్పండి.



చట్టాలు

# హిందూ వివాహ చట్టం 1955

-ఆర్. దుర్గాప్రసన్న అడ్వకేట్



**1929లో బాల్య వివాహాలను నిరోధించినప్పటికీ విద్యా, ఆర్థిక స్వాతంత్ర్యాలు లేనందున వివాహ వ్యవస్థలోని, సామాజిక వ్యవస్థలోని అనేక లోటుపాట్ల వల్ల స్త్రీలు ఎక్కువమంది నష్టపోయే పరిస్థితులే ఉండేవి. తనకు దుష్యంతుడితో జరిగిన వివాహాన్ని నిరూపించుకోలేక శకుంతల పడిన అవమానం, దుఖఃం కథలుగా చెప్పుకోవడం మనకందరకూ తెలుసు.**

ప్రపంచ దేశాలన్నీ కూడా స్త్రీ పురుషులిద్దరూ కలిసి జీవించడానికి, వివాహం, తద్వారా సంతానాన్ని పొంది కుటుంబ జీవనం సాగించడం, వివాహాన్ని ఒక వేడుకగా జరుపుకోవడం మనకందరికీ తెలిసిందే. వివాహం వల్ల స్త్రీకి వైవాహిక జీవితంలో ఒక సాంఘిక భద్రత కలుగుతుంది. వైవాహిక సంబంధాల్లో స్త్రీ పురుషులిరువురిలో స్త్రీలే ఎక్కువగా కష్టానష్టాల్ని ఒంటరిగా ఎదుర్కోవలసి రావడం మనం చూస్తూనే ఉన్నాం. ప్రాచీనకాలం నుండి వివాహం చేసుకునే పద్ధతులు అనేకం అమలులో ఉన్నప్పటికీ నాగరిక జీవనంలో ఇరు కుటుంబాల పెద్దలు తమకుమారునికి లేదా కుమార్తెకు తగిన వరుని/వధువుని ఎంపికచేసి వివాహాలు జరిపించడం ఆనవాయితీగా వస్తుంది. లేదా యువతీ యువకులు వారు ఎంపిక చేసుకున్న వ్యక్తితో కుటుంబీకులు, బంధుమిత్రుల సమక్షంలో వివాహాలు చేసుకుంటూ ఉన్నారు. పూర్వకాలంనుండీ మన దేశంలో ఆడపిల్లలను తండ్రి సంరక్షణనుండి ఎంపిక చేసి వరునితో వివాహం జరిపించి భర్త సంరక్షణలోకి వివాహతంతు ద్వారా అప్పగించేవారు. వివాహానంతరం పురుషుడు బ్రహ్మ చర్యంను వీడి గృహస్తుగా మారి కుటుంబ, మత, సామాజిక కార్యక్రమాలను నిర్వహిస్తూ ఉండేవారు. అంతేకాక వంశాభివృద్ధికి పురుష సంతానాన్ని అభిలషించేవారు.

1929లో బాల్య వివాహాలను నిరోధించినప్పటికీ విద్యా, ఆర్థిక స్వాతంత్ర్యాలు లేనందున వివాహ వ్యవస్థలోని, సామాజిక వ్యవస్థలోని అనేక లోటుపాట్ల వల్ల స్త్రీలు ఎక్కువమంది నష్టపోయే పరిస్థితులే ఉండేవి. తనకు దుష్యంతుడితో జరిగిన వివాహాన్ని నిరూపించుకోలేక శకుంతల పడిన అవమానం, దుఖఃం కథలుగా చెప్పుకోవడం మనకందరకూ తెలుసు.

కేవలం స్త్రీల కొరకు మాత్రమే హిందూ వివాహ చట్టం 1955 వచ్చిందని అనలేము. కానీ, ఈ చట్టం వల్ల వివాహం, వైవాహిక హక్కుల పునరుద్ధరణ, విడాకులు, మోసగించి చేసుకున్న పెళ్ళిని రద్దు చేసుకునే హక్కు తరువాతి కాలంలో మనోవర్తిని పొందే హక్కులను ఈ చట్టం కల్పించింది. వివాహం పేరుతో మోసపోయిన అనేక మంది స్త్రీలకు ఈ చట్టం వైవాహిక హక్కుని, సాంఘిక భద్రతని కల్పించినట్లైంది.

ఆనాటి పరిస్థితులలో వివాహం చట్టబద్ధం కావలసిన పరిస్థితిని గుర్తెరిగి 1955వ సంవత్సరంలో మే నెల 18వ తేదీన హిందు వివాహ చట్టాన్ని రూపొందించి అదే రోజు నుండి అమలులోకి వచ్చునట్లు నాటి పార్లమెంటు చట్టం చేసింది.

అనేక పద్ధతుల్లో జరిగే వివాహాలన్నింటినీ క్రోడీకరించి వివాహాన్ని చట్టబద్ధం చేయటమే కాకుండా వైవాహిక హక్కులను చట్టబద్ధం చేయడం జరిగింది. ప్రాచీన కాలంలో వివాహం జరిగిన తరువాత ఎట్టి పరిస్థితులలోనూ విడాకులు అనే మాట వుండేది కాదు. పశ్చిమ దేశాలలోలాగా భారతీయుల వివాహం ఒక ఒడంబడిక కాదు. వివాహం అంటే ఒక మతపరమైన క్రతువు. ఒకసారి వివాహం చేసుకున్నాక, అగ్నిసాక్షిగా, పంచభూతాల సాక్షిగా కానీ ప్రమాణం చేసిన తరువాత ఆ దంపతులు ఎట్టి పరిస్థితులలోనూ విడిపోయే ఆలోచనను కలిగివుండేవారు కాదు. వారు జీవితాంతం కలిసివుండవలసిందే. ఆధునిక

కాలంలో అది అసాధ్యమైంది. కొన్ని వివాహాలకు విడాకులు అనివార్యమయ్యే పరిస్థితులు తలెత్తుతున్న నేపధ్యంలో హిందూ వివాహ చట్టం విడాకులను కూడా చట్టబద్ధం చేసింది. అప్పట్లో చాలా తక్కువమంది మాత్రమే వారి వారి కులాచారాల ప్రకారం "మారు మనువు" పేరిట కులపెద్దల ఎదుట ముందు జరిగిన పెళ్ళిని రద్దు చేసుకుని, అపరాధ రుసుము చెల్లించి వేరే పెళ్ళిళ్ళు చేసుకునేవారు. కానీ ఈ చట్టం ద్వారా విడాకులు అందరికీ వర్తింపచేశారు.

హిందూ వివాహ చట్టం ఎవరెవరికి వర్తిస్తుంది? వివాహానికి కావల్సిన అర్హతలు, వివాహపద్ధతి, చట్టబద్ధంగా దంపతులు విడివిడిగా ఉండటం, చెల్లని వివాహాలు, విడాకులు, దంపతులు ఇరువురూకలిసి విడాకులు కోరుకోవడం మాత్రమే కాక ఏ విధమైన ఆర్థిక వనరులూ లేని భాగస్వామికి ముఖ్యంగా భార్యకి భరణం కేటాయించడం, పిల్లల పోషణా భారం తండ్రి భరించడం కూడా ఈ హిందూ వివాహ చట్టంలో విపులంగా నిర్ధేశించడం జరిగింది. అంతేకాక వివాహం అక్రమ వివాహమైనా, సక్రమ వివాహమైనా వారి పిల్లలకు చట్టపరంగా హక్కులు కల్పించడం జరిగింది.

సెక్షన్ 2 ప్రకారం వీరశైవులు, లింగాయత్‌లు, బ్రాహ్మణులు, ఆర్యసమాజానికి చెందినవారికి, బౌద్ధులు, జైనులు, సిక్కులులాంటి అన్ని మతాల వారికి అంటే ముస్లీం, క్రైస్తవులు, పార్శిలు కానీ వారికి అందరికీ ఈ చట్టం వర్తిస్తుంది.

సెక్షన్ 5లో వివాహం చేసుకోవడానికి కూడా కొన్ని షరతులు విధించడం జరిగింది. అవి:

1. వరునికి 21సం॥ వధువును 18 సం॥ నిండి ఉండాలి.
2. వివాహం నాటికి అంటే తమ జీవిత భాగస్వామి ఉండగా 2వ వివాహం చెల్లదు. వధువైనట్లైతే భర్త, వరుడైనట్లైతే భార్య జీవించి వుండకూడదు. (living spouseని కలిగి వుండకూడదు )
3. బుద్ధి మాంద్యం, మానసిక వైకల్యం, మూర్ఛ మొదలైన వ్యాదులు కలిగి వున్న వ్యక్తులు వివాహానికి అనర్హులు.
4. సంప్రదాయం నిషేదించిన దగ్గరి రక్త సంబంధీకుల మధ్య వివాహం నిషేదం.
5. సపిండులు, సగోత్రీకులు అయివుండరాదు. అంతేకాక వివాహం నాటికి అమ్మాయి తరపున ఎవరెవరు గార్డియన్/ సంరక్షకులుగా వ్యవహరించ వచ్చును? అనే విషయాన్ని కూడా ఇందులో స్పష్టంగా వివరించడం జరిగింది. (అప్పట్లో మైనర్ బాలిక వివాహాలు ఉన్నందున)

సెక్షన్ 7లో వివాహతంతు వారి వారి ఆచారాల ప్రకారం నిర్వహించినప్పటికీ సప్తపది ముఖ్యక్రతువుగా (అంటే వివాహం తరువాత చివరి అంకం) నిర్ణయించి వివాహ కార్యక్రమం పూర్తి అయినట్లుగా నిర్ణయిస్తారు. పాణిగ్రహణ, జీలకర్ర బెల్లం, మంగళ సూత్ర ధారణవంటి తంతులన్నీ సాంప్రదాయక ఆచారాలే. ఇక సప్తపది అంటే అగ్ని హోత్రుని చుట్టూ వధూవరులు కలిసి వేసే ఏడు అడుగులు, ప్రమాణాలు జరిగిన తరువాతనే వివాహం కార్యక్రమం పూర్తయినట్లు.

ఏ కారణాలవల్లనైతేనేమి? దంపతుల మధ్య అభిప్రాయ బేధాలు, కలిసి జీవించలేని ప్రతికూల పరిస్థితులు ఏర్పడినప్పుడు, లేదా భార్య భర్తలో ఎవరో ఒకరు నిర్లక్ష్యంగా వ్యవహరించినపుడు వైవాహిక హక్కుల పునరుద్దరణ జరగాలన్నా, విడాకులు తీసుకోవాలన్నా, న్యాయస్థానంలో వివాహం జరిగినట్లుగా నిరూపణ అవసరం. హిందు వివాహ చట్టం ప్రతి హిందూ వివాహాన్ని (Registration) నమోదు చేసుకోవలసిందిగా సెక్షన్ 8లో పొందుపరచడం జరిగింది. అంతేకాదు, రాష్ట్ర ప్రభుత్వాలు వివాహ నమోదు (Registration ) ని తప్పనిసరి చేస్తూ తగిన ఉత్తర్వులివ్వాలని సూచించింది.

భార్యా భర్తల్లో ఎవరైనా తగిన కారణాలు, అంటే కౄరత్వం, మతమార్పిడి, వివాహేతర సంబంధాలకు పాల్పడడం, 2 సం॥ల కంటే ఎక్కువకాలం విడిగా వుండటం, నయంకాని మానసిక వ్యాధులు కలిగివుండటం లాంటి వైవాహిక జీవనం సజావుగా సాగే పరిస్థితులు లేనప్పుడు విడాకులు (భార్యగానీ/భర్తగానీ) కోరుతూ న్యాయస్థానాన్ని ఆశ్రయించవచ్చును. అంతేకాదు సెక్షన్ 12 ప్రకారం మోసగించి చేసుకున్న వివాహం కూడా చెల్లదు. భర్త నపుంసకుడైనప్పుడు, మోసగించి మాయమాటలతో ప్రలోభ పరచి చేసుకున్న వివాహం కూడా చెల్లదని స్పష్టం చేసిందీ చట్టం. తరువాతి కాలంలో నేటి పరిస్థితులకు అనుగుణంగా స్త్రీల కొరకు చిన్న చిన్న సవరణలు ఈ చట్టంలో చేసారు. ముఖ్యంగా హింసించే భర్తలనుండి విడాకులు కోరినపుడు, మనోవర్తి విషయంలోనూ, భార్యకి ఇష్టంలేకుండా భర్త విడాకులు కోరినపుడు ఈ చట్టం స్త్రీల పట్ల సానుకూల దృకృథంతో తీర్పునివ్వడం గమనించ తగిన విషయం.

**గత చైతన్యమానవి సంచికలో ముద్రించిన కందుకూరి వీరేశలింగం గారి బొమ్మకు బదులు గురజాడ బొమ్మ ముద్రించడమైనది. ఈ పొరపాటుకు చింతిస్తున్నాము.**

**-ఎడిటర్**
**చైతన్య మానవి.**

# ఉద్యమాల బాటలో...



కర్నూల్


నెల్లూరు

**మద్యంపై:** ప్రకాశం జిల్లా ఒంగోలులో ఎక్సైజ్ పాలసీని మార్చాలని కోరుతూ రాష్ట్ర స్థాయి రౌండ్‌టేబుల్ సమావేశం టి. అరుణ అధ్యక్షతన జరిగింది. సమావేశంలో ఐద్వా రాష్ట్ర అధ్యక్ష కార్యదర్శులు కె. సుబ్బరావమ్మ, కె. స్వరూపరాణి ఎన్ఎఫ్ఐడబ్ల్యు రాష్ట్ర అధ్యక్షులు పి. దుర్గాభవాని, తెలుగు మహిళా అధ్యక్షురాలు శోభాహైమావతి మరియు వివిధ స్వచ్ఛంద సంస్థల నుండి హాజరయ్యారు. కేరళ, తమిళనాడు ఢిల్లీ రాష్ట్ర ప్రభుత్వాలే షాపుల నిర్వహణ జరుపుతున్నారు. మన రాష్ట్రంలో కూడా అదే విధానాన్ని ప్రవేశపెట్టాలని, షాపుల సంఖ్యను పరిమితం చేయాలని, ఎక్సైజ్ చట్టంలో వున్న రూల్స్, రెగ్యులేషన్స్ పాటించాలని, ఎండోమెంట్, రికగ్నైజ్డ్ స్కూల్స్ కాకపోయినా గుడి బడివద్ద వైన్ షాపులకు అనుమతివ్వరాదని అక్రమంగా బెల్టు షాపులను ప్రోత్సహిస్తున్న లైసెన్స్ షాపులను రద్దు చేయాలని బెల్టు షాపుల సమాచారాన్ని ఎక్సైజ్ శాఖకు తెలియజేసేందుకు టోల్‌ఫ్రీ నెంబరును కేటాయించాలని, డి ఎడిక్షన్ క్యాంపులు నిర్వహించాలని, గ్రామస్థాయినుండి రాష్ట్ర స్థాయి వరకు మద్య నియంత్రణ కమిటీలు వేయాలని, ప్రభుత్వ సంక్షేమాన్ని దృష్టిలో పెట్టుకుని మద్యం ఆదాయాన్ని ప్రభుత్వం ఒక ఆదాయ వనరుగా చూడొద్దని రౌండ్‌టేబుల్ సమావేశం పలు డిమాండ్స్‌ను ఏకగ్రీవంగా అంగీకరించిది.




మద్య నియంత్రణ దిశగా ప్రభుత్వ ఎక్సైజ్ పాలసీ వుండాలని, మద్యం ఆదాయాన్ని ఒక ఆదాయ వనరుగా చూడొద్దని కోరుతూ అన్ని మహిళా, స్వచ్ఛంద సంస్థలూ కలిసి ఎక్సైజ్ కమిషనర్‌కి మెమోరాండం ఇవ్వడం జరిగింది.

విశాఖలో ఐద్వా ఆధ్వర్యంలో మద్యం పాలసీని మార్చాలని కోరుతూ రౌండ్‌టేబుల్ సమావేశం జరిగింది. వివిధ సంఘాల నేతలు పాల్గొన్నారు.

కర్నూలు జిల్లా కమిటి ఆధ్వర్యంలో 'ఎక్సైజ్ పాలసీని రద్దు చేయాలి. ప్రభుత్వమే పరిమిత సంఖ్యలో షాపులు నిర్వహించాలి'అని డిమాండ్ చేస్తూ సదస్సు జరిగింది.

జనవాసాల్లో పెట్టిన మద్యం షాపులను తొలగించాలని విజయవాడ, యనమల కుదురు, ఒంగోలులో షాపుముందు ఆందోళన చేసారు. మహిళల ఆందోళన ఫలితంగా అక్కడినుంచి తొలగించారు.

ఎన్నికల మ్యానిఫెస్టోలో పొందుపరిచిన విధంగా పొదుపు సంఘాల రుణమాఫీ చేయాలని కోరుతూ విజయవాడలో 200 మందితో సదస్సు జరిగింది. బ్యాంకర్లు పొదుపు సంఘాల పొదుపు డబ్బును రుణ బకాయి కింద జమ చేయడాన్ని ఐద్వా తీవ్రంగా ఖండిస్తూ ప్రభుత్వం వెంటనే విధి విధానాలను ప్రకటించి త్వరితగతిన రుణమాఫీ చేసి తిరిగి రుణాలు మంజూరు చేయాలని డిమాండ్ చేయటం జరిగింది.

అనకాపల్లిలో పొదుపు సంఘాల రుణమాఫీపై రౌండ్‌టేబుల్ సమావేశం జరిగింది.


విశాఖజిల్లా

చిత్తూరు జిల్లా ఐద్వా మహాసభలు తిరుపతి పట్టణంలో జరిగాయి.

- గత 3 నెలలుగా రేషన్ షాపులలో అందించే నిత్యవసర వస్తువులు ముఖ్యంగా పామాయిల్ ఆపుచేయటంతో మహిళలు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కోంటున్నారు. బహిరంగ మార్కెట్లో ధరలు ఆకాశాన్నంటుతున్నాయి. రేషన్ షాపులో రూ. 45 వున్న పామాయిల్ బహిరంగ మార్కెట్లో రూ. 70 పలుకుతోంది. ఐద్వా రాష్ట్ర కమిటీ పౌరసరఫరాల కమీషనరును కలిసి నాణ్యమైన 15 రకాల సరుకులను సరసమైన ధరలకు రేషన్ షాపుల ద్వారా అందించాలని వినతిపత్రం యివ్వటం జరిగింది.



తూర్పుగోదావరి





అమలాపురం



కర్నూల్


కర్నూల్


గ్రేటర్ విశాఖ






డ్వాక్రా రుణమాఫీ వెంటనే అమలు చేయాలని కోరుతూ 13జిల్లాలలో కలెక్టర్, మున్సిపల్, మండల ఆఫీసుల వద్ద సదస్సులు ధర్నాలు జరిగాయి. ముఖ్యమంత్రికి పోస్టుకార్డుల కార్యక్రమం జరిగింది.

పశ్చిమ గోదావరి, కృష్ణాజిల్లా కమిటీల ఆధ్వర్యంలో ముఖ్యమంత్రికి రుణమాఫీపై పరిమితులు విధించకుండా వెంటనే మాఫీ చేయాలని మెమోరాండాలు యిచ్చారు.

స్వయం సహాయ సంఘాల నుండి విఓఎలకు జీతాలు చెల్లించాలని, గ్రూపులు ఒక్కంటికి 1,000 కట్టాలని తూ.గోదావరి






జిల్లా ప్రాజెక్టు డైరెక్టర్ ఆదేశాలతో జిల్లాలో సభ్యుల నుండి తీవ్ర ఆందోళన వ్యక్తమైంది. కాకినాడ జిల్లా కలెక్టర్ ఆఫీసు, అమలాపురం ఆర్‌డిఓ ఆఫీసు వద్ద వందల మందితో ధర్నాలు జరిగాయి. రాష్ట్ర కార్యదర్శి, జిల్లా నాయకత్వం ప్రాజెక్టు డైరెక్టర్‌ను కల్సి ప్రభుత్వమే విఓఎలకు జీతాలు చెల్లించాలని గ్రూపు సభ్యులపై భారాలు వేయవద్దని డిమాండ్ చేశారు.

**హింసపై :** బాలికలు, శిశువులు, మహిళలపై జరుగుతున్న హింసకు వ్యతిరేకంగా హింసలేని సమాజాన్ని నిర్మిద్దాం అనే నినాదంతో అఖిల భారత మహిళా సంఘం యిచ్చిన పిలుపుపై జులై 4వ తేది మానికొండ సూర్యవతిగారి వర్ధంతి సందర్భంగా మహాత్మాగాంధి విగ్రహం వద్ద ప్రతిజ్ఞ కార్యక్రమాలు అన్ని జిల్లాల్లో జరిగాయి. విశాఖ, రాజమండ్రిలో సదస్సులు జరిగాయి

**యం.పి. తపస్‌పాల్ వ్యాఖ్యలపై :** పశ్చిమ బెంగాల్ తృణముల్ యం.పి తమ రాజకీయ కక్ష సాధింపుకోసం మహిళలను టార్గెట్‌గా చేసి సిపియం మహిళలను అత్యాచారాలు చేయమని పబ్లిక్ మీటింగ్‌లో చెప్పడాన్ని నిరసిస్తూ దేశవ్యాప్తంగా ఆందోళనలు జరిగాయి. ఆంధ్రప్రదేశ్‌లో తపస్‌పాల్ వ్యాఖ్యలకు వ్యతిరేకంగా అతని పదవినుండి తొలగించాలని, రాష్ట్రపతికి టెలిగ్రామ్‌లు దిష్టిబొమ్మ దగ్ధం11కేంద్రాలో జరిగింది.



# అల్లూరు జీవితం ఒక పాఠ్య పుస్తకం

-ఎస్. పుణ్యవతి



పశ్చిమగోదావరి జిల్లా పేరు వినగానే నా తరం పార్టీ కామ్రేడ్స్‌కు జ్ఞాపకం వచ్చేవారు మొదట ఉద్దరాజు రామం, మాణిక్యాంబ, ఆ తరువాత కామ్రేడ్ అల్లూరు, ఆర్.ఎస్. ఆ నాయకుల సారథ్యంలో కలిసి పనిచేసే అవకాశం నాలాంటి వారికి దొరకడం భాగ్యంగా భావిస్తాము.

మహిళా రంగం బాధ్యతల రీత్యానూ, అమ్మాజీతో ఉన్న సాన్నిహిత్యం రీత్యాను, అలాగే ట్రేడ్ యూనియన్‌లో పని రీత్యానూ అల్లూరుతో సాన్నిహిత్యం ఉండేది. ప్రతి అనుభవం అక్షర రూపంలో పెట్టడం సాధ్యం కాదుగాని పూల పరిమళం దారానికి అంటినట్లు వారి పని, ప్రవర్తన, కుటుంబం నుండి చూసి నేర్చుకోవాల్సినవి. ఇలా ఉండాలి కదా! కమ్యూనిస్టులు అని అనిపించేవి చాలానే ఉన్నాయి. అల్లూరు కార్మికోద్యమంలో కొబ్బరికాయల దింపూ ఒలుపు, సంఘం మొదలుకొని హమాలీలు, రైసుమిల్లు కార్మికులు ఇలా ఎంతో మందిని చిన్న చిన్న సంఘాలుగా పెట్టి సంఘటితం చేశారు. నాయకత్వం అంటే పదువులు కాదు. కష్టాల్లో ఉన్న ప్రజల్ని సంఘటితం చేసి పోరుబాటలో నడిపంచడమే నాయకత్వం. అదే ఈ తరం నాయకులం ఆయన వద్దనుండి నేర్చుకోవాల్సింది. ఆ తరం నాయకులు 'ఆల్ రౌండర్స్'. అది, ఇదీ అనకుండా అన్ని బాధ్యతలు, అన్ని సంఘాల నిర్మాణం చేపట్టారు. అమ్మాజీ పుట్టింటి నేపథ్యం కొంతభాగం అయితే అల్లూరు ప్రభావంతో పేద శ్రామిక మహిళల్ని చైతన్య పర్చి ఆమె నిర్వహించిన పోరాటాలు, కార్యక్రమాలు నాకు కూడా ఒక పాఠంలాగా అనిపించేవి. నా వయసువారే అయినా వారి అమ్మాయిలు సరోజ, శారద, సుజాత పార్టీ పట్ల వారి విశ్వాసం, 'కమ్యూనిస్టు ఇలా కదా ఉండవలసింది'అని అనిపిస్తుంది.

ఆయన అభిమానం, దాంతోపాటే క్రమశిక్షణ భీమవరంలో 30 సంవత్సరాల కిందట జరిగిన రాష్ట్ర రాజకీయ పాఠశాల సందర్భంగా గమనించాను. నేను ఆ క్లాసుకు వస్తున్నానని తెలిసి మా నాన్న నన్ను చూడడానికి వచ్చారు. మా నాన్నకు ఎక్కడ పార్టీ మీటింగ్ జరిగినా వెళ్లడం అలవాటు. రాఘవులు మా నాన్నను తీసుకుని భోజనానికి హొటలుకు వెళ్లారు. అల్లూరుకి తెలిసి 'ఏమ్మా పుణ్యవతి, మీ నాన్నకు భోజనం పెట్టలేమనుకున్నావా? హొటలుకు పంపించావు' అని ప్రేమగానే మందలించారు. మహిళలకు సంబంధించిన కేసుల విషయంలో కూడా ఆయన సున్నితంగా స్పందించే తీరు నాకు ఇప్పటికీ గుర్తు. ఆయన ప్రోద్బలం ఉండబట్టే పాలకొల్లులో మహిళా బుర్రకథ దళం తర్ఫీదై అనేక ప్రదర్శనలిచ్చింది. ఎప్పటికీ మర్చిపోలేని వ్యక్తి కామ్రేడ్ అల్లూరు. మేము, మా తరువాత తరం కమ్యూనిస్టులకు ఆయన జీవితం ఒక పాఠ్యపుస్తకం.

CMV01A 144

R.NO. APTEL/2006 - 20000




50

Printed & Published by Mallu Swarajyam, Published at AIDWA State Office, Block No.24, HIG, Phase-II, 1-8-1, Baghlingampally, Hyderabad -500 044. Printed at Prajasakti Daily Printing Press, M.H.Bhavan, Plot No.21/1, Azamabad Industrial Area, Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020. Ph: 27665420. Editor : T.Jyothi



| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01A144 |
| పుస్తకం పేరు | చైతన్య మానవి |
| తారీఖు | 27/08/2023 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | Sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | Good |